Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

పట్టు తప్పితే పడిపోతావ్

పంపినవారు:
ఎం. సి. లింకన్ - కర్నూలు

శుభకరమైన ఉగాది పండుగకు, మా ఖాతాదారులకు శ్రేయోభిలాషులకు వందనములు

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

హెడ్ ఆఫీసు: ఉమా మహలు :: మచిలీపట్టణము













"ఉమా" బొత్తాము ధర రు. 0.85
"ఉమా" కప్పుల జత ధర రు. 2-25

"ఉమా" వయరు కటింగు గాజులు జత 2-4 సైజు ధర రు. 11-50
"ఉమా" బాల్సు గాజులు 2-4 సైజు జత ధర రు. 18-00

"ఉమా" వెడ్డింగు నెక్‌లేసు ధర రు. 20-00 ★ సాధారణ వి. పి. పార్శెలు చార్జీ రు. 1-37

మేము తయారుచేయు అసలు బంగారు కవరింగు "ఉమా" బ్రాండ్ నగలు అనేక సంవత్సరములు మన్నిక యుండి తృప్తిపరచును. ఎప్పుడున్ను, అన్ని శుభకార్యములకున్ను ఉపయోగించవచ్చును. మాయొక్క బ్రాంచీలయందుగాని, హెడ్డాఫీసునందుగాని లభించును.

బ్రాంచీలు:

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు-1. ★ 581, శివాలయం వీధి, విజయవాడ.

* ఆర్డర్లకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు, క్యాటలాగుకు హెడ్డాఫీసుకు మాత్రమే.

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★


| | |
|---|---|
| మహాభారతం ... | 2 |
| జ్వాలాద్వీపం-4 ... | 9 |
| వాసవదత్త ... | 17 |
| ప్రతీకారం ... | 26 |
| పేదవాడి బరువు ... | 33 |
| రాజూ-దొంగా ... | 40 |
| మార్కోపోలో-1 ... | 49 |
| గలివర్ యాత్రలు ... | 53 |
| గంగావతరణం (గే క.) | 57 |
| గుణపాఠం ... | 62 |
| ప్రశ్నోత్తరాలు ... | 70 |


ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



కొత్త శీర్షిక :

## చరిత్ర ప్రసిద్ధ ప్రదేశాలు

ఆంధ్రదేశంలో చరిత్రప్రసిద్ధి గల గ్రామాలూ, నగరాలూ అనేకం ఉన్నాయి. వీటిని గురించి "చందమామ" పాఠకులు తెలుసుకో గలందులకు ఈ శీర్షిక ప్రారంభిస్తున్నాము. అయితే ఈ శీర్షికకు వ్యాసాలు పంపే భారం "చందమామ" పాఠకులకే వదులుతున్నాము. మీ గ్రామం చరిత్ర ప్రసిద్ధి గలది అయినా సరే, లేక అలాటి గ్రామం మీ జిల్లాలో ఉన్నా సరే దానిని గురించి "చందమామ"లో ఒక పేజీకి సరిపడేలాగ రాయండి. ఆ గ్రామం గురించి పుక్కటిపురాణాలేవైనా ఉంటే వాటినికూడా రాయండి. "చందమామ"లో ప్రచురించబడే ప్రతి వ్యాసానికీ రు. 10లు బహూకరిస్తాము. వ్యాసాలను మే నెలాఖరు లోగా ఈ కింది చిరునామాకు పంపండి.

"చరిత్ర ప్రసిద్ధ ప్రదేశాలు"
"చందమామ"
2 & 3, ఆర్కాటు రోడ్డు,
వడపళని :: మద్రాసు - 26

Stanes

ఇది పరిశుద్ధమైన కాఫీ, పొదుపైన కాఫీ,
మీ రుచికి తగినట్టే ప్రత్యేకంగా తయారైంది.
స్టేన్స్ శుద్ధమైన కాఫీ, ఎన్నికైన కాఫీ,
హొటెళ్ళు, రెస్టారెంట్లు ఎల్లప్పుడు
ఎంచుకునేది ఇదే. మీరూ దీన్నే వాడుకచెయ్యండి.

Stanes

స్టేన్స్
పరిశుద్ధమైన కాఫీ

ది యునైటెడ్ కాఫీ సప్లై కంపెనీ లిమిటెడ్,
కోయంబత్తూరు.




G. 67


నేడే
చూడండి
సారథీ వారి
మహాకవి
కాళిదాసు
దర్శకత్వం.. కె. కామేశ్వరరావు
కథ, మాటలు, పాటలు... పింగళి • సంగీతం...పెండ్యాల • ఛాయ..అన్నయ్య
కళ...గోఖలే • నృత్యం...పసుమర్తి. వెంపటి
నవయుగ
నిర్మాతలు ...... కె. నాగమణి
పి. సూరిబాబు

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

కె. ఎ. డి. నివాస్, (3 వ ఫ్లోరు) మూగ్‌బాట్ వీధి, బొంబాయి-4. (ఫోన్: 75526)

కలకత్తా: బ్రిస్టల్ హోటల్ బిల్డింగ్స్; నెం. 2, చౌరంగీ రోడ్, కలకత్తా-13

6/11. 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)

వస్తూంది!

పద్మిని పిక్చర్స్ సమర్పించు

# పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం

నిర్మాత - దర్శకుడు:
బి.ఆర్.పంతులు

G.H.RAO

ప్రపంచములో సర్వశ్రేష్ఠుడైన భాగవతోత్తముడు ఎవరు?

—బాలకశ్రేష్ఠుడు ప్రహ్లాదుడు

విశ్వవిఖ్యాతి గాంచి ఉన్నతపదవి నొందిన అమర బాలు డెవరు?

—బాలకశ్రేష్ఠుడు ధ్రువుడు

ప్రచండ రావణ కుంభకర్ణాదుల జయించి ప్రఖ్యాతి నొందిన శ్రీరామచంద్రుని ఓడించినది ఎవరు?

—బాలకశ్రేష్ఠులు లవకుశులు

ఎవ్వరు జయించలేని తారకాసురుని వధించిన దెవరు?

—బాలకశ్రేష్ఠుడు కార్తికేయుడు

పూజలందుకొనే మొదటి దైవమెవరు?

—బాల విఘ్నేశ్వరుడు

క్రూరకంసుని కూలద్రోసిన దెవరు?

—బాల మురళీకృష్ణుడు

మృత్యుంజయుని నెదిరించి పాశానికి చిక్కక ప్రాణాలను కాపాడుకొని చిరాయు వైనది ఎవరు?

—బాల మార్కండేయుడు

ఇటువంటి బాలవీరుల సాహసోపేతాలకు ఈడైన చర్యలతో కూడుకొన్నట్టి చిత్రమే.

"పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం"



పిల్లలు దైవసమానులు.
పిల్లలు పూజనీయులు.
ఈనాటి బాలురే భావి పౌరులు.
పిల్లలే దేశ సౌభాగ్యం.
పిల్లలే తల్లుల సంపద.
పిల్లలే స్వార్థరహితులు.
పిల్లల సంకల్పమే దేవుని సంకల్పం.

ఈ పై సత్యాలను ఋజువుచేసే
మహోన్నత చిత్రరాజం

## "పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం"





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మహాభారత యుద్ధం తాలూకు భీష్మపర్వం ఈ సంచికతో పూర్తి అవుతున్నది. ఇప్పటికి పదిరోజుల యుద్ధం పూర్తి అయింది. ఇంకా ఎనిమిది రోజుల యుద్ధం మిగిలి ఉన్నది. మిగిలిన యుద్ధం తాలూకు పోరాటం వివరాలు తగ్గించి యుద్ధం తాలూకు కథకు మాత్రమే ప్రాముఖ్యం ఇవ్వటానికి ప్రయత్నిస్తాము. పాఠకులు ఇదివరకే యుద్ధపోరాట వివరాలు చదివి ఉన్నారు గనక ఈ మార్పును ఆమోదిస్తారని నమ్ముతున్నాము.

ఈ సంచికనుంచి "మార్కో పోలో సాహసయాత్రలు", "గలివర్ యాత్రలు" ప్రారంభిస్తున్నాము. "గలివర్ యాత్రలు" కార్టూన్ కథగా తొమ్మిది సంచికలలో వెలువడుతుంది. కార్టూన్‌కథలు 'చందమామ'లో ప్రకటించటం యిదె ప్రథమం. ఈ శీర్షికలు "అహింసాజ్యోతి" లాగ మూడు రంగులలోగాక నాలుగు రంగులలో ముద్రించబడుతున్నాయి. ఇవి పాఠకులను ఆకర్షించగలవని ఆశిస్తున్నాము.

సంపుటి 26 : ఏప్రిల్ 1960 : సంచిక 4



# మహాభారతం

ఎనిమిదో రోజు రాత్రి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు సమావేశమయారు. దుర్యోధనుడు ఈ విధంగా అన్నాడు: "మన భీష్మ ద్రోణ కృప శల్యులందరూ ఉండికూడా పాండవులను నిర్మూలించ లేకుండా ఉన్నారు. కారణం తెలియదు. పాండవులు చూడబోతే విజృంభించి యుద్ధంచేస్తున్నారు. మన బలాలు నానాటికీ క్షీణిస్తున్నాయి. దేవుడూ, పాండవులూ ఏకమై హేళన చేస్తున్నట్టుగా ఉన్నది నా బ్రతుకు. ఈ యుద్ధంలో ఎలా జయిస్తానో తెలియటంలేదు."

ఈ మాటలు విని కర్ణుడు, "మహారాజా, చింతించకండి. భీష్ముణ్ణి యుద్ధం విరమించుకోమనండి. నేను నా బంధువులతో సహా ఆ పాండవులను క్షణంలో యమలోకానికి పంపుతాను. భీష్ముడికి పాండవులంటే ప్రీతి, పైగా ఆయనకు దురభిమానమూ, ముక్కోపమూనూ. అందుచేత ఆయన పాండవులను ఒక్కనాటికి నిర్మూలించలేడు. ఆయన ఈ క్షణాన అస్త్రసన్యాసం చేస్తే నేను మరుక్షణాన కదనరంగం ప్రవేశించి, నా శౌర్య పరాక్రమాలు ఆయనకే చూపుతాను," అన్నాడు.

ఈ మాటలకు దుర్యోధనుడు సంతోషించి, మర్నాటి యుద్ధానికి సేనలను ఆయత్తం చెయ్యమని దుశ్శాసనుడితో చెప్పి, కర్ణుడితో, "కర్ణా, నేనిప్పుడే భీష్ముడి శిబిరానికి వెళ్ళి ఆయనను అస్త్రసన్యాసానికి ఒప్పించి వస్తాను," అని చెప్పాడు.

తరవాత దుర్యోధనుడు మంచి బట్టలూ, నగలూ ధరించి అట్టహాసంగా ముస్తాబై, గొప్ప పరివారాన్ని వెంటబెట్టుకుని భీష్ముడి శిబిరానికి వెళ్ళాడు. భీష్ముడు అతనికి తగిన విధంగా స్వాగతమిచ్చి కూచోబెట్టాడు. అతను భీష్ముడితో, "తాతా, కేకయ పాంచాల సోమకుల నందరినీ రూపుమాపుతానని లోగడ ప్రతిజ్ఞచేసి ఉన్నావుగదా,



ఆ పని ఎందుకు చేయవు. ఒకవేళ నీకు పాండవుల మీద ప్రేమ ఉన్నా, లేక, నాపైన ఆగ్రహం ఉన్నా నీవు యుద్ధం చెయ్యటం మాని యుద్ధ భారమంతా కర్ణుడిపైన పెట్టు. అతను పాండవులను బంధుమిత్ర పరివార సమేతంగా మారణం చేసేస్తాడు!" అన్నాడు.

ఈ మాటలు వినేసరికి భీష్ముడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. కళ్ళు ఎర్రబడిపోయాయి. ఆయన ఆ కోపాన్ని ఎలాగో అణుచుకుని, "దుర్యోధనా, ఎందుకిలా నన్ను శూలాలతో గుచ్చినట్టుగా మాట్లాడతావు? నీ కోసమే గదా శత్రుసైన్యాలను కార్చిచ్చులాగా దహించుతున్నాను? అర్జునుడు ఎలాటి యోధుడైనదీ నీకుమాత్రం తెలియదా? నిన్ను గంధర్వులు పట్టుకుపోయినప్పుడు అతను ఒంటరిగా వచ్చి విడిపించాడే! అప్పుడు నీ తమ్ములందరూ పారిపోలేదా? ఈ కర్ణుడు ఏమైనా చెయ్యగలిగాడా? తిరిగి ఈ అర్జునుడే విరాటనగరం దగ్గిర మనల నందరినీ ఓడించాడుగదా! అతను అసహాయ శూరుడనటానికి ఇంకేం నిదర్శనం కావాలి? నేను ఒక్క శిఖండిని తప్ప మిగిలిన సోమక పాంచాలుల నందరినీ చంపేస్తాను, లేదా వారి చేతిలో చచ్చి అయినా పోతాను. రేపు నేను చేయబోయే యుద్ధం నీవే చూద్దువుగాని!" అన్నాడు. ఈ మాటలకు తృప్తిచెంది దుర్యోధనుడు పరివారంతో సహా శిబిరానికి వెళ్ళిపోయాడు.

తెల్లవారుతూనే కౌరవసైన్యాలు సర్వతోభద్రమనే వ్యూహంలో ఆయత్తమయాయి. ఈ తొమ్మిదవరోజు యుద్ధంలో గొప్పగా పోరాడి శత్రుసైన్యాలను చించి చెండాడిన వారిలో అభిమన్యుడొకడు. ఆ రోజు అతడి ధాటికి ద్రోణ కృప అశ్వత్థామలూ, సైంధవుడూ కూడా తట్టుకోలేకపోయారు. అది చూసి దుర్యోధనుడు అలంబుసుడనే రాక్షసుణ్ణి అభిమన్యుడిపైకి పంపాడు. ఇద్దరికీ భయంకరమైన యుద్ధం జరిగింది.





అయితే అందరికన్న శత్రువులపైన ప్రళయ తాండవం సాగించినవాడు భీష్ముడు. పాండవులు కౌరవ సైన్యాలను ఎలా నిర్మూలించారో, భీష్ముడు అలాగే పాండవ సైన్యాలను నిర్మూలించాడు. ఆయన ధాటికి తట్టుకోలేక పాండవ సైన్యాలు పారిపోతుంటే వాటిని ఆపటం ఏ ఒకరికీ సాధ్యంకాలేదు. ఆయన అలా యుద్ధం చేస్తూండగానే సూర్యాస్తమయం అయింది. సూర్యుడితోపాటే పాండవుల ధైర్యం కూడా అస్తమించింది. కౌరవుల ఆనందానికి మటుకు మేరలేదు.

అలంబుసుడు బాగా దెబ్బతిని మాయ పన్ని అంతటా అంధకారం కల్పించాడు. ఆ అంధకారాన్ని ఛేదించటానికి అభిమన్యుడు సూర్యాస్త్రం ప్రయోగించాడు. చివరకు అలంబుసుడు ఓడి పారిపోయాడు. అభిమన్యుడు కౌరవ సేనలను భీభత్సపరిచాడు.

త్వరలోనే కౌరవయోధులు అభిమన్యుణ్ణి చుట్టుముట్టి ఒంటరివాణ్ణి చేశారు. అతన్ని రక్షించటానికి అర్జునుడు వచ్చాడు. తరవాత ఉభయ పక్షాల వీరులకూ అనేక రకాలుగా ద్వంద్వ యుద్ధాలు సాగాయి. ఆ రోజు యుద్ధంలో అర్జునుడు కూడా అభిమన్యుడికి తీసిపోకుండా శత్రునాశనం సాగించాడు.

ముందు జరగవలసిన యుద్ధంగతి గురించి పాండవ యోధులు మాట్లాడుకున్నారు. ధర్మరాజు కృష్ణుడితో, "అవతల భీష్ముడుండగా ఈ యుద్ధాన్ని తలపెట్టడం ఎంత అవివేకమైన పని! ఆయన మమ్మల్ని బతకనివ్వడు, బతికి ఉంటే ఏ ధర్మమైనా సాధించవచ్చు. చచ్చి ఏమి సాధించగలం? నేను యుద్ధం మానేస్తాను. నీ సలహా ఏమిటి?" అన్నాడు.

దానికి కృష్ణుడు, "భీష్ముడు చచ్చినట్టయితే నీకు విజయం తప్పదు. భీష్ముణ్ణి చంపటం అర్జునుడికి ఇష్టంలేని పక్షాన నన్ను యోధుడుగా నియమించు. నీ ఆజ్ఞతో



అస్త్రం పట్టి నేనా భీష్ముణ్ణి క్షణంలో వధించి నీకు విజయం చేకూర్చుతాను!" అన్నాడు.

"కృష్ణా, నీవు అస్త్రం పట్టనని అని ఉన్నావు. నీ మాట అబద్ధం చెయ్యటం నా కిష్టంలేదు. యుద్ధం చెయ్యటం తప్ప మాకు నీవల్ల ఏ యితర సహాయం లభించినా అదే పదివేలు. మొదట్లో భీష్ముడు నా పక్షాన యుద్ధం చెయ్యకపోయినా ఇతర రీతిగా సహాయపడతా నన్నాడు. ఆయన నా మేలు కోరేవాడు. అందుచేత మనం ఆయనవద్దకు వెళ్ళి ఆయన ఎలాగు చచ్చిపోతాడో ఆ ఉపాయం అడుగుదాం....కృష్ణా, తండ్రి లేని మమ్మల్ని ఆయన తండ్రిలాగా పెంచాడే, ఆయనను చంపటానికి చూస్తున్నాంగదా, ఈ క్షత్రియ జన్మ ఏమి జన్మ!" అన్నాడు ధర్మరాజు.

కృష్ణుడు ధర్మరాజు సూచనను ఆమోదించి, భీష్ముడు ఎలా చస్తాడో ఆయననే అడగటంలో తప్పు లేదన్నాడు. పంచపాండవులూ, కృష్ణుడూ ఆయుధాలూ కవచాలూ తీసివేసి, కిరీటాలు కూడా లేకుండా భీష్ముడి వద్దకు వెళ్ళి, ఆయనకు భక్తితో నమస్కారాలు చేశారు.

భీష్ముడు వారిని ఎంతో ఆదరంతో కూర్చోబెట్టి కుశలప్రశ్నలు వేసి, వచ్చిన పని



అడిగాడు. ధర్మరాజు ఆయనతో, "తాతా, అరోజు కారోజు జనక్షయం అవుతున్నదేగాని మేము గెలిచే జాడ లేదు. నిన్ను యుద్ధంలో ఎలా గెలవాలో మాకు తెలియటంలేదు. నిన్ను జయించే ఉపాయం ఏదైనా ఉంటే చెప్పవా?" అన్నాడు.

దానికి భీష్ముడు, "పాండవులారా, నేను జీవించి ఉండగా ఈ యుద్ధంలో మీకు విజయం లభించేది కల్ల. మీకు గెలవాలని ఉంటే నన్ను శీఘ్రంగా పడగొట్టండి. అందుకు మీకు శిఖండి ఉన్నాడు. వాడు మహారథుడు, రణశూరుడు. కాని వాడు మొదట స్త్రీ అయిఉండి అనంతరం పురుష



డైన కారణంచేత నేను వాడితో యుద్ధం చెయ్యను. అనుక వాణ్ణి ముందుంచుకుని మన అర్జునుడు నాపైకి యుద్ధానికి వస్తే నన్ను సులువుగా చంపగలుగుతాడు. ఆ తరవాత కౌరవ సేనలు ఎలాగూ ఓడిపోతాయి," అన్నాడు. పాండవులు ఈ సలహా తీసుకుని పితామహుడికి నమస్కరించి తమ శిబిరాలకు వెళ్ళిపోయారు.

ఇంతా అయాక అర్జునుడు నీరుకారిపోయాడు. అతను కృష్ణుడితో, "నన్ను భీష్ముడు దుమ్ములో ఆడుకుంటూంటే చూసి బాధపడేవాడు. ఒకనాడాయన తొడ మీద కూచుని 'నాన్నా' అని పిలిస్తే, 'నేను నీకు తండ్రిని కాను, నాయనా, తాతను,' అన్నాడు. ఆయనను ఎలా చంపను? ఆయన మమ్మల్నందరినీ చంపినా సరే!" అన్నాడు దీనంగా.

అర్జునుణ్ణి కృష్ణుడు మందలించాడు. చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకోవటానికి భీష్ముణ్ణి చంపవలసిందే నన్నాడు. తనను చంపబూనినవాణ్ణి చంపటం క్షత్రియధర్మమని బోధించాడు.

పదవ రోజు తెల్లవారింది. ఈ రోజు పాండవులు శిఖండిని ముందుంచుకుని తమ సైన్యాలతో యుద్ధరంగానికి కదిలారు. కౌరవసైన్యాలకు భీష్ముడు ముందు నిలబడ్డాడు. యుద్ధం ఆరంభమవుతూనే పాండవ సృంజయులు విజృంభించి కౌరవసైన్యాలను చెండాడసాగారు. ఇది చూసి భీష్ముడు మండిపడి పాండవ సైన్యాలను దారుణ హింసాకాండకు గురి చేయసాగాడు. ఆయన దుర్యోధనుడితో, "నేను పదివేల రథికులను చంపకుండా యుద్ధం చాలించనని నియమం పెట్టుకున్నాను. ఆ ప్రకారమే ఈ రోజు పదివేలమంది రథికులను చంపుతాను. అధైర్యపడకు," అన్నాడు.

అవతల పాండవ యోధులందరూ ఆ రోజు భీష్ముణ్ణి చంపటమే తమ లక్ష్యంగా





పెట్టుకుని అయనపైకే వచ్చారు. అలాగే కౌరవ యోధులు అయనను రక్షించటమే తమ లక్ష్యంగా పెట్టుకుని, భీష్ముడిపైకి వచ్చే శత్రు యోధులకు అడ్డుపడి ప్రాణాలపై ఆశ వదిలి యుద్ధంచేశారు. ఈ విధంగా ఆ పదవరోజు యుద్ధమనే జూదంలో భీష్ముడు పణం అయాడు.

అర్జునుడు శిఖండితో, "నీతో భీష్ముడు యుద్ధం చేయడు. నువ్వు ఇవాళ అయనను చంపితీరాలి. ఇతర కౌరవ యోధులందరూ కలిసి నిన్ను అడ్డినా వారినందరినీ నే నొక్కణ్ణే ఎదుర్కొని, వారివల్ల నీకేమీ ప్రమాదం రాకుండా చూస్తాను. ఎలాగైనా ఈనాడు భీష్ముణ్ణి చంపి నీవు శాశ్వత కీర్తి సంపాదించాలి!" అని హెచ్చరించాడు.

ఆ రోజు అర్జునుడు శిఖండిని వెన్నాడే ఉన్నాడు. పాండవపక్షాన గల యోధు లందరూ భీష్ముణ్ణి చంపటానికి కంకణం కట్టుకుని అయనపైకి వచ్చారు. అదేవిధంగా కౌరవ వీరులందరూ అయనను రక్షించ టానికి కంకణం కట్టుకుని పాండవ వీరు లను హోరాహోరి ఎదిరించారు. ఆ రోజు దుశ్శాసనుడు ప్రత్యేకించి భీష్ముణ్ణి అంటి పెట్టుకుని ఉండి అద్భుతమైన శౌర్య ప్రతా పాలు ప్రదర్శించాడు. ద్రోణుడికి భీష్ముడా రోజు యుద్ధంలో పడిపోతాడని ఎందుకో సందేహం కలిగింది. అయన తన కొడుకైన అశ్వత్థామతో, "నాయనా, ఏ తండ్రి కూడా కొడుకు మరణం కోరడు. కాని ఇవాళ నీవు నీ ప్రాణాలను కూడా లక్ష్యంచేయక భీష్ముణ్ణి కాపాడాలని నా ఆజ్ఞ!" అన్నాడు.

తన పక్షపు యోధులు పాండవయోధు లను ఎదిరించి పోరాడుతూంటే భీష్ముడు తన ప్రాణాలకోసం కొంచెంకూడా లక్ష్య పెట్టక మృత్యువిహారం చేస్తూ తాను అను కున్న ప్రకారం పదివేల మంది శత్రురథికు లనూ చంపాడు, విరాటుడి తమ్ముడైన శతానీకుణ్ణి చంపేశాడు.



ఆయన ఒంటరిగా ఉభయ సైన్యాల మధ్య నిలబడి పాండవసేనలను మారణహోమం చేస్తున్న సమయంలో శిఖండి రథం వెనకగా కృష్ణుడు అర్జునుడి రథాన్ని తోలుకుంటూ ఆయనను సమీపించాడు.

భీష్ముడు శిఖండితో యుద్ధం చెయ్యలేదు, కాని అతని గుర్రాలనూ సారథినీ కొట్టాడు. అర్జునుడు శిఖండి వెనకనుంచి భీష్ముడి చేతిలోని విల్లు విరగగొట్టాడు. ఆయన ఎన్ని విల్లులు ఎత్తితే అన్నిటినీ తన బాణాలతో విరగగొట్టాడు. ఈలోపుగా శిఖండి భీష్ముడి శరీరంనిండా బాణాలు గుచ్చేస్తున్నాడు, కాని భీష్ముణ్ణి అవి బాధించలేదు, అయితే అర్జునుడి బాణాలు తగిలినప్పుడల్లా ఆయన బాధతో నొచ్చుకుని, "ఈ బాణాలు శిఖండివి కావు," అన్నాడు.

"మీరంతా భీష్ముడిపై తలపడండి, మీకేమీ ప్రమాదం రాదు!" అని ధర్మరాజు తన పక్షపు యోధులను హెచ్చరించాడు.

రెండు గడియలపాటు భీష్ముడి చుట్టూ అతి భయంకరమైన యుద్ధం చెలరేగింది. అ తరవాత దుర్యోధనాదులందరూ చూస్తూండగానే భీష్ముడు తూర్పువైపు తల ఉంచి రథం మీదనుండి కిందికి ఒరిగిపోయాడు. అయితే ఆయన దేహం నేలకు తగలకుండా ఆయన శరీరంలో గుచ్చుకున్న బాణాలే ఆపాయి. ఎక్కడా రెండంగుళాలు ఖాళీ లేకుండా ఆయన శరీరంనిండా బాణాలు గుచ్చుకున్నాయి. అవే ఆయనకు అంపశయ్య అయాయి.

భీష్ముడు పడిపోగానే సైన్యంలో హాహాకారాలు చెలరేగాయి. అది దక్షిణాయన కాలం. మహనీయులు ఉత్తరాయణంలో ప్రాణాలు వదలగోరుతారు.

భీష్ముడు ప్రాణపరిత్యాగం తన చేతిలో ఉన్నవాడు. అందుచేత ఆయన ఉత్తరాయణం వచ్చేదాకా జీవించి ఉండటానికి సంకల్పించాడు.






## 4

[బోయలు చిత్రసేనుడితో ఉగ్రాక్షుడు తమ పశువులనూ, మనుషులనూ ఎత్తుకుపోతున్నట్టు చెప్పారు. చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కోటకు వెళ్ళాడు. రాజ్యంలో పశువులనూ, మనుషులనూ ఎత్తుకు పోతున్నది జ్వాలాద్వీపం నుంచి వస్తున్న భయంకర మానవులని ఉగ్రాక్షుడు అన్నాడు. వాళ్ళను చూపుతానని అతడు చిత్రసేనుడికి మాట యిచ్చాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు చిత్రసేనుణ్ణీ, అతడి వెంట వచ్చిన పరివారాన్నీ, భటులనూ వెంటపెట్టుకుని వారికి తన కోటలోని వెలలేని రత్నరాసులనూ, వెండి బంగారాలనూ చూపించాడు. ప్రపంచం పుట్టినప్పటినుంచి, ఆనాటివరకూ రాక్షసులు వాడిన వివిధ రకాల ఆయుధాలూ, విచిత్రమైన శిరస్త్రాణాలూ చూచి, చిత్రసేనుడు చాలా అబ్బురపడ్డాడు. కాని, అతణ్ణి అన్నిటికన్న ఆశ్చర్యపరిచింది రాక్షసుడి కోటలో వున్న ధనరాసులు. రాక్షసులకు ధనంతో ఏం పని? "ఉగ్రాక్షా! రాక్షసులైన మీకు, ఈ ధనకనకాలతో ఏం పని?" అని అడిగాడు చిత్రసేనుడు.

ఈ ప్రశ్న వింటూనే ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, "ఏనాటికైనా, మా రాక్షసజాతి నాగరికులై, మీలాగా వర్తక వ్యాపారాలూ, వ్యవసాయప్పనులూ చేయదలిస్తే, వీటిని ఉపయోగించుకుంటారు. అదొక్కటే కాక, మరో పద్దెనిమిదేళ్లకు సంభవించనున్న ఒకానొక ముఖ్య సంఘటనను మనసులో వుంచుకుని



కూడా, ఈ ధన కనకాలను కోటలో భద్ర పరిచాను," అన్నాడు.

పద్దెనిమిదేళ్ల తరవాత ముఖ్య సంఘటన అంటూ ఉగ్రాకుడు మాట్లాడగానే, చిత్రసేనుడికి, యిందులో ఏదో మోసం వున్నదన్న అనుమానం కలిగింది. అయినా, తన అనుమానాన్ని రాకీసుడు పసికట్టేలా ప్రవర్తించటం మంచిదికాదు. తను పద్దెనిమిదేళ్ల తర్వాతో ఎప్పుడో, నిజంగా తన కొడుకును ఆతడి పరం చేస్తానని, వాడు నమ్మితే నమ్మనీ అనుకున్నాడతడు.

చిత్రసేనుడు రాకీసుడి కోటలోని అద్భుతాలన్నీ చూసేలోపల సూర్యాస్తమయమయింది. ఉగ్రాకుడు, తన అతిథికీ, అతడి అనుచరులకూ గొప్ప విందు చేశాడు. విందు మధ్యలో ఉగ్రాకుడి సేవకుడొకడు, యజమాని దగ్గిరకు పరిగెత్తుకువచ్చి, "ప్రభో! జ్వాలాద్వీప వాసులు ఎక్కివచ్చే భయంకర పక్షి ఒకటి కుంభికుప్ప ప్రాంతంలో కనిపించింది. అక్కడ కాపలా వాళ్లు మంటలు వేసి, ఆ సంగతి తెలియపరిచారు," అన్నాడు.

సేవకుడి మాటలు వింటూనే ఉగ్రాకుడు అదిరిపడి, "చిత్రసేనా! మనం త్వరగా బయలుదేరటం మంచిది. నీ రాజ్యంలో ప్రజలను ఎత్తుకుపోయే, మహా క్రూరుల్ని నీకు చూపెడతాను," అన్నాడు.





అందరూ క్షణాలమీద భోజనాలు చేసి ఉగ్రాక్షుడి వెంట బయలుదేరారు. ఉగ్రాక్షుడు, తనవెంట చిత్రసేనుణ్ణీ, కొద్దిమంది ఆయుధధారులైన తన సేవకుల్నీ తీసుకుని తతిమ్మావారిని, తన అనుచరులవెంట మరో దిక్కుగా పంపాడు.

ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ కోట వదిలి తూర్పు దిక్కుగా కొంతదూరం అడివిలో నడిచేసరికి, హఠాత్తుగా కోటవైపునుంచి పెద్ద రెక్కల చప్పుడూ, కీచుమనే వికృత ధ్వనులూ వినిపించాయి. అందరూ చెట్ల మధ్య ఆగి కోటకేసి చూశారు. కోటమీద వలయాకారంగా రెక్కలు చాచిన కొన్ని వింత ఆకారాలు ఎగురుతున్నవి. కోట రక్షకులైన రాక్షసులు పొడుగాటి డివిటీలు గాలిలోకి ఎత్తి, కేకలు పెడుతూ అవి కిందికి దిగకుండా భయపెడుతున్నారు.

"ఉగ్రాక్షా! ఈ వికృతాకారాలు భయోత్పాతం కలిగించేలా వున్నవే! అవి నీ కోట మీద దిగి, దాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నవా?" అన్నాడు చిత్రసేనుడు.

"జ్వాలాద్వీప వాసులు, అలాంటి ప్రయత్నం లోగడ ఒకటి రెండుసార్లు చేశారు. కాని, నా సేవకులు పెద్దపెద్ద కాగడాలూ, ఈటెలూ వుపయోగించి, ఆ భయంకర పక్షులపై స్వారీ చేస్తున్న ఒకణ్ణి కింద





పడగొట్టారు. వాణ్ణి గానుగకు కట్టి నాలుగైదు చుట్లు తిప్పేసరికి, తను ఎక్కడినుంచి వచ్చిందీ చెప్పాడు. కాని, తతిమ్మా వివరాలు తెలుసుకునే లోపలే వాడు చావటం జరిగింది. ఇప్పుడు, వాడి అనుచరులు నా మీద పగ తీర్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. అంతే. వాళ్లు సాహసించి కోటలో దిగరని నా నమ్మకం," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు మాటలు ముగించీ ముగించక ముందే, ఆ చుట్టుపట్లగల చెట్టుచేమలు గాలికి వూగిపోయినై. ఆ వెంటనే గుండెలవిసే లాంటి భీకర ధ్వనులతో రెండు పక్షులు, అల్లంత ఎడంలో కిందికి దిగినై. వాటి వీపుల



మీదినుంచి, పులిచర్మాలు ధరించిన నలుగురు మనుషులు దిగారు.

వెంటనే ఉగ్రాక్షుడు, చిత్రసేనుణ్ణీ తన అనుచరులనూ ఎత్తుగా వున్న చెట్లమాటుకు తీసుకుపోయాడు. వింత పక్షులనుంచి దిగిన మనుషులు నేలబారున పడుకుని చుట్టూ చెట్లలోకి కొద్దిసేపు జాగ్రత్తగా పరీక్షించి చూసి, తరవాత లేచి ఏమో సంప్రతించుకుని, ముందుకు నడిచారు. వారి వెనకగా రెక్కలల్లాడిస్తూ పక్షులు బయలుదేరినై.

నిజానికి రెక్కలున్నా వాటిని పక్షులనేందుకు వీల్లేదు. వాటి ముక్కులు దాదాపు మూడడుగుల పొడవున్నవి. ముక్కులు తెరిచినప్పుడల్లా, వాటి నోళ్ళల్లో పులికోరల్లాంటి పళ్లున్నవి. శరీరంమీద ఎక్కడా ఈకలు లేవు. జంతువులకున్నట్టు వాటికి చిన్న తోక ఒకటి వున్నది. అవి పక్షులలాగే రెండు కాళ్ల మీద కొంచెం ముందుకు వంగి నడుస్తున్నవి. వాటి ఎత్తు పదెనిమిది అడుగులుంటుంది.

"నిజమైన ప్రమాదం ఆ పులిచర్మం గాళ్లనుంచి కాదు, ఈ వింతపక్షుల నుంచి. అవి వాళ్లకు వాహనాలుగానూ, రక్షకులుగానూ పనిచేస్తవి. ఎవరైనా ఆ క్రూరుల్ని ఎదుర్కొంటే, ముందుగా వచ్చి మీద పడేవి ఈ పక్షులు. రకరకాల ఈలలతో వాటిని

తమ శత్రువులమీదికి ఆ పులిరాయుళ్ళు ఉసికొల్పుతారు. నా సేవకుల్లో కొందర్ని ఈ పక్షులు తమ ముక్కుల్తో, కాలి గోళ్ళతో చీల్చి ముక్కలుముక్కలుగా చేసినై," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు ఇలా మాట్లాడుతున్నంతలో, వింత పక్షులమీదనుంచి దిగినవాళ్ళు మెల్లగా ఈలలువేస్తూ, చెట్లలోకి నడవసాగారు. పక్షులు రెండూ ఒకసారి ముక్కులు పైకెత్తి, రెక్కలాడించి వాళ్ల వెనకగా కదిలినై.

"అదుగో, ఆ కొండ పాదంలో వున్న గూడెంకేసే వీళ్ల ప్రయాణం. మరికొందరు నీ పౌరులు మాయమవబోతున్నారు," అన్నాడు ఉగ్రాక్షుడు.

"అయితే, మనం చూస్తూ వూరుకో వలసిందేనా ?" అన్నాడు చిత్రసేనుడు ఉద్రేకంగా.

"ఆ( అంతకన్న చేసేదేముంది ? వాళ్ల వెంట ఆ భయంకర పక్షులుండగా, మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఆ ద్వీపవాసులు ఒంటరిగా దొరికితే, నా బొటనవేలుతో నొక్కి చూర్ణం చూర్ణం చేయగలను," అన్నాడు ఉగ్రాక్షుడు కోపంగా

ఇంతలో ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ నిలబడివున్న చెట్టు మీదినుంచి చెవులు



గింగుర్లెత్తేలా గుడ్లగూబ ఒకటి అరిచింది. ఆ అరుపు వింటూనే, పులిరాయుళ్లు చప్పున వెనుదిరిగారు. వాళ్ల చేతుల్లోని బరిసెలు చీకట్లో తళతళ మెరిసినై. భయంకర పక్షులుకూడా ఆగి, పెద్దగా ముక్కులు తెరిచి, వికృతంగా కూతపెట్టినై.

"ఇక్కడెవరో వున్నట్టు వాళ్లు పసి గట్టారు !" అన్నాడు ఉగ్రాక్షుడు. ఆ వెంటనే తన సేవకుల్ని దగ్గరకు పిలిచి, రహస్యంగా ఏమో చెప్పాడు. వాళ్లు రెండు ముఠాలుగా చీలి వెళ్లిపోయారు. మరుక్షణం భయంకర పక్షులు ముక్కులు సాచి, ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ వున్న చోటుకు పరిగెత్తి



రాసాగినై. వాటి వెనకగా పులిచర్మం ధరించినవాళ్లు బరిసెలు వూపుతూ ముందుకు దూకుతున్నారు.

చిత్రసేనుడు కత్తి దూశాడు. ఉగ్రాక్షుడు దిక్కులు పిక్కటిల్లేలా రంకెవేసి తనచేత గల రాతిగద ఝుళిపిస్తూ, కుప్పించి ముందుకు దూకాడు. అతడు రాతి గదతో తలమీద బలంగా కొట్టేసరికి, ఒక భయంకర పక్షి పక్కకు పడిపోయింది. కాని, రెండోది అతడి కుడిభుజాన్ని కాళ్లతో గట్టిగా తన్నుతూ, ముక్కుతో బలంగా తలమీద పొడిచింది. అదే క్షణాన ఉగ్రాక్షుడి సేవకులైన రాక్షసులు, గుండె అదిరేలా అరుస్తూ,



వెనకనుంచి రెండు ముఠాలుగా వచ్చి, పులిచర్మాలు ధరించిన వాళ్లమీద పడ్డారు. ఇదే అదనుగా చిత్రసేనుడు కూడా ముందుకు లంఘించి, తన కత్తితో ఒక శత్రువును అడ్డంగా నరికాడు.

ఆ తరవాత క్రూరాతిక్రూరమైన పోరు ప్రారంభమైంది. ఉగ్రాక్షుడు తనకు తగిలిన గాయాలను సరకుచేయక, భీకరంగా రంకెలు వేస్తూ, తన చేత గల రాతి గదతో భయంకర పక్షులను మోదసాగాడు. అవి అతడి దెబ్బలను తప్పుకుంటూ, పక్కకు ఎగిరి అంతలోనే వచ్చి అతడిమీద కలబడసాగినై. వాటి ముక్కుపోట్లకూ, కాలిగోళ్ళ దెబ్బలకూ, ఒక్క ఉగ్రాక్షుడే కాక, అతడి సేవకులుకూడా గురి అయారు. కొందరు బాధతో అరుస్తూ కింద పడిపోయారు.

చిత్రసేనుడు తన కత్తి దెబ్బకు ఒక శత్రువు కింద పడగానే, తతిమ్మావాళ్లమీదికి వురికాడు. వాళ్లు తమ బరిసెలతో అతడి కత్తినుంచి రక్షణ చేసుకుంటూ, విచిత్రమైన ఈలలు వేస్తూ వెనక్కు తగ్గసాగారు. వాళ్లను చుట్టుముట్టాలన్న ప్రయత్నం పక్షులు అడ్డురావటంతో, చిత్రసేనుడికీ, ఉగ్రాక్షుడి అనుచరులకూ సాధ్యంకాలేదు. అవి తమ రెక్కలతో, ముక్కులతో, కాళ్లతో





వారిని చితక బాదుతూ, తమ యజమాను లతోపాటు వెనక్కు వెళ్లసాగినై.

ఇది చూసిన ఉగ్రాక్షుడు భయంకరంగా ఘూర్ణిల్లుతూ, రాతి గదను రెండు చేతులతో రివ్వురివ్వుమని తిప్పుతూ, ముందుకురికాడు. అసరికి చావగా మిగిలిన శత్రువులు ముగ్గురూ, పక్షుల రెక్కలమీదికి ఎగబాకారు. వాళ్లు కీచుమంటూ పెద్దగా ఈల వేయగానే పక్షులు గాలిలోకి లేచినై. ఉగ్రాక్షుడు రాతి గదను గాలిలో గిర్రున తిప్పి, వాటికేసి విసిరాడు. ఆ ఊపుకు అతడు వెల్లకిలా పడిపోయాడు. బాణంలా మీదికి వస్తున్న గదను ఒక భయంకర పక్షి ముక్కుతో గట్టిగా పొడిచింది. ఆ వెంటనే రాతిగద దభీమంటూ కింద పడిపోయింది.

గాయాలవల్ల రక్తం వరదలై పారుతూ కింద పడివున్న ఉగ్రాక్షుణ్ణి, చిత్రసేనుడు సమీపించి, "ఉగ్రాక్షా! ప్రాణాపాయకరమైన దెబ్బలేమీ తగలలేదుగదా?" అని అడిగాడు.

"ప్రాణాపాయమా!" అంటూ ఉగ్రాక్షుడు బాధతో మూలిగి, "ప్రాణాపాయం ఏమీ లేదు. బహుశా, పదిరోజులపాటు మంచం పట్టవలసివస్తుంది. నా సేవకు లెంతమంది చచ్చారు?" అని అడిగాడు.

"ఇద్దరిని భయంకర పక్షులు ముక్కులతో చీల్చివేసినై. నలుగురు గాయాల బాధతో మూలుగుతున్నారు," అంటూ సమీపానికి వస్తున్న రాక్షసులకేసి తిరిగి, "శత్రువుల్లో ఒక్కడేగదా, చచ్చింది?" అని అడిగాడు చిత్రసేనుడు.

"అవును, రాజా!" అన్నారు వాళ్ళు.

"ఛీ, పిరికిపందల్లారా! ఇంతమంది రాక్షస వీరులం వుండగా, ఎక్కడినుంచో వచ్చిన మానవమాత్రులు మనల్ని చావచితక కొట్టటమా? ఛీ!" అంటూ ఉగ్రాక్షుడు లేవబోయాడు. అంతలో, అతడి సేవకులు దగ్గిరకు వచ్చి, అతణ్ణి నడుమూ, భుజాలూ పట్టుకుని లేవనెత్తి, నిలబెట్టారు. —(ఇంకా వుంది)





# వాసవదత్త

ఉదయన వాసవదత్తల వివాహం జరిగాక కొంతకాలం వినోద విలాసాలతోనూ, వేట తోనూ వేడుకగా గడిచిపోయింది. ఈ సమయంలో అరుణి అనేవాడు వత్సరాజ్యంలో చాలాభాగం అపహరించి కౌశాంబీ రాజధానిని కూడా ఆక్రమించుకున్నాడు.

వత్సరాజుకు అతని రాజ్యం తిరిగి సంపాదించి పెట్టేటందుకు ఆయన మంత్రులైన యౌగంధరాయణ, రుమణ్వంత, వసంతకులు ఆలోచన చేశారు; మగధ రాజైన దర్శకుడికి పద్మావతి అనే చెల్లెలున్నది, ఆమెకూ ఉదయన మహారాజుకూ ఎలాగైనా వివాహం జరిపించినట్టయితే, మగధరాజు సహాయంతో అరుణిని జయించి వత్స రాజ్యాన్ని తిరిగి సంపాదించవచ్చునని వారు నిశ్చయించారు.

అయితే వత్సరాజుకు ప్రియభార్య వాసవదత్త ఉండగా తన చెల్లెలు పద్మావతిని ఇవ్వనని దర్శక మహారాజు ఖచ్చితంగా చెప్పేశాడు. అందుకని మంత్రులు ఒక నాటకం ఆడారు: లావాణకం వద్ద వత్స రాజు వేటాడుతున్నాడు, ఆ సమయంలో శిబిరం నిప్పు అంటుకుని అందులో వాసవదత్త మరణించినట్టూ, ఆమెను రక్షించబోయి యౌగంధరాయణుడు కూడా చనిపోయినట్టూ వత్సరాజుకు మిగిలిన ఇద్దరు మంత్రులూ తెలిపారు. ఇందుకు వాసవదత్త కూడా ఒప్పుకున్నది.

వత్సరాజు వేటనుంచి శిబిరానికి వచ్చే లోపుగా యౌగంధరాయణుడు బ్రాహ్మణ తాపసి వేషం ధరించాడు, వాసవదత్త బ్రాహ్మణస్త్రీ వేషం ధరించి అవంతిక అని పేరు మార్చుకున్నది; ఇద్దరూ కలిసి మగధకు రాజధాని అయిన రాజగృహానికి బయలుదేరారు. వారు రాజగృహం వెలపల ఉండే ఒక ఆశ్రమం చేరారు.



వారు ఆశ్రమం చేరవచ్చేటప్పుడు రాజ సోదరి పద్మావతి ఆశ్రమం చూడవచ్చింది. భటులు, "తొలగండి, దారి ఇవ్వండి!" అని కేకలు పెడుతూ ముందు వచ్చారు. అటువంటి అదిలింపు యౌగంధరాయణుడికీ, వాసవదత్తకీ కూడా అలవాటు లేదు. కాని వారి వెనకగా వచ్చేది పద్మావతి అని తెలిసి ఇద్దరూ సంతోషించారు.

పద్మావతికి ఆశ్రమస్త్రీలు ఆప్యాయంగా స్వాగతమిచ్చారు. ఆమె వెంట ఉండే కంచుకి ఆశ్రమవాసులతో, ఎవరి కేమేమి కావాలో పద్మావతిని అడగమన్నాడు. ఎవరూ ఏమీ కోరలేదు, కాని యౌగంధరాయణుడు ముందుకు వచ్చి, "అయ్యా, నాదొక మనవి. ఈమె నా చెల్లెలు. ఆమె భర్త దేశాంతరాలలో ఉన్నాడు. నేను తిరిగి వచ్చేదాకా ఈమెను రాజసోదరి తనవద్ద ఉంచుకోవాలని నా కోరిక," అన్నాడు. పద్మావతి అందుకు సమ్మతించింది.

ఆ సమయంలో అక్కడికి లావాణకం నుంచి ఒక విద్యార్థి వచ్చాడు. అతను శావటానికి రాజగృహం వాడేగాని, లావాణకంలో వేదవిద్యాభ్యాసం చేస్తున్నాడు. అతను లావాణకం విశేషాలు చెబుతూ, శిబిరంతో పాటు వాసవదత్తాదేవీ, యౌగంధరాయణుడూ కాలిపోగా వేటనుంచి తిరిగివచ్చిన ఉదయన మహారాజు తన భార్యతాలూకు కాలిపోయిన ఆభరణాలూ మొదలైనవి గుండెకు హత్తుకుని విలపించి, తానుకూడా ఆ మంటలలోనే పడి ఆత్మహత్య చేసుకోబోయాడనీ, మంత్రులు ఎంతో బలవంతంగా ఆయనను ఆపారనీ, ఆయన దుఃఖంతో స్పృహ తప్పిపోయాడనీ చెప్పాడు.

ఇదంతా విని వాసవదత్త కన్నీరు కార్చే సరికి ఆమెది ఎంత సున్నితమైన మనస్సోనని అందరూ అనుకున్నారు. ఉదయన మహారాజుకు తిరిగి స్పృహ వచ్చినట్టు విద్యార్థి చెప్పినాక పద్మావతి ఒక పెద్ద

నిట్టూర్పు విడిచి, తనకు ఉదయనుడిపై గల అనురాగం బయటపెట్టుకున్నది.

తరవాత యౌగంధరాయణుడు పద్మావతి వద్ద సెలవు తీసుకుని ఆశ్రమప్రాంతం నుంచి వెళ్ళిపోయాడు.

పద్మావతి వాసవదత్తను తనవెంట తీసుకుపోయింది. పద్మావతి తన భర్త అయిన ఉదయనుణ్ణి ప్రేమించి పెళ్ళాడగోరుతున్నట్టు వాసవదత్త తెలుసుకున్నది. త్వరలోనే వారిద్దరి వివాహంకూడా స్థిరపడింది. కాని ఇందుకుగాను ఉదయనుడు ఎలాటి ప్రయత్నమూ చేయలేదు. వత్సరాజైన ఉదయనుడు ఏదో పనిమీద రాజగృహానికి రాగా దర్శక మహారాజు అతని అభిజాత్యమూ, యౌవనమూ, అందమూ చూసి తన సోదరిని చేసుకోమని కోరాడు. పెళ్ళిముహూర్తం చేరవస్తున్నకొద్దీ వాసవదత్తకు చీకటి తనను చుట్టుముట్టుతున్నట్టయింది.

ఆమె అందరిమధ్యా నిలవలేక ఒంటరిగా వెళ్ళి ఒక పొదరింట కూచుని తన దుస్థితికి విచారిస్తూ ఉంటే ఒక దాసి పూలు పట్టుకుని ఆమెను వెతుక్కుంటూ వచ్చి, పెళ్ళికూతురికోసం వివాహ మాల కట్టమన్నారని చెప్పింది. పాపం, వాసవదత్త మాల కట్టి ఇచ్చి, "ఇకనుంచి నా భర్తకూడా నా వాడుకాడు!" అనుకున్నది.





ఒకనాడు పుష్పవనంలో రాతి తిన్నెపైన పద్మావతీ, వాసవదత్తా, ఒక చెలికత్తే చేరి మాట్లాడుకుంటున్నారు. ఆ సమయంలో, పద్మావతికి ఉదయనుడిపై ఎలాటి ప్రేమ ఉన్నదీ తెలుసుకోవటానికి వాసవదత్త ప్రయత్నించింది.

"నేనేమీ చెప్పలేను, కాని ఆయన దగ్గిర లేకపోతే ఒంటరిగా ఉన్నట్టు తోస్తుంది. వాసవదత్తాదేవి ఆయనను నాలాగే ప్రేమించేదా అని అనుకుంటూ వుంటాను," అన్నది పద్మావతి.

"ఇంతకంటెకూడా హెచ్చుగా ప్రేమించేది!" అన్నది వాసవదత్త నోరు జారి.

"ఆ సంగతి నీకెలా తెలుసూ?" అని పద్మావతి అడిగింది.

వాసవదత్త తెప్పిరిల్లుకుని, "లేకపోతే అయినవారిని కూడా తృణీకరించి ఆయన వెంట వెళ్ళిపోయి పెళ్ళాడుతుందా?" అని జవాబిచ్చింది.

తరవాత పద్మావతి తన భర్త ఇంకా వాసవదత్తను మరిచిపోలేదనీ, తాను వీణ వాయిస్తానంటే ఆయన పెద్దగా ఒక్క నిట్టూర్పు విడిచి మౌనంగా ఉండిపోయాడనీ చెప్పింది.

"అలా అయితే ధన్యురాలిని!" అని వాసవదత్త తన మనసులో అనుకున్నది.

ఈ సమయంలో ఉదయనుడూ, వసంతకుడూ పద్మావతిని వెతుకుతూ అటుగా వచ్చారు. తనవెంట వాసవదత్త ఉండటం చేత రాజు కంట పడటం ఇష్టంలేక పద్మావతి తన చెలికత్తెలిద్దరితోనూ ఒక పొదరింట్లోకి వెళ్ళిపోయింది. అప్పటికీ వసంతకుడు ఆ పొదరింట్లో వెదుకుదామని సమీపించాడు; పద్మావతి చెలికత్తె తేనెతుట్టెను రేపేసరికి తేనెటీగలకు భయపడి వసంతకుడు వెనక్కు వచ్చేశాడు.

తరవాత రాజూ, విదూషకుడైన వసంతకుడూ రాతితిన్నెపైన కూచుని సంభాషించు

కున్నారు. "ఇక్కడ ఎవరూ లేరు. మిమ్మల్ని ఒక్కమాట అడగాలనివుంది; అడగనా?" అన్నాడు వసంతకుడు. ఉదయనుడు అడగమన్నాడు.

"నీకు పద్మావతి అంటే ఎక్కువ ఇష్టమా? వాసవదత్త అంటే ఎక్కువ ఇష్టమా?" అని వసంతకుడు అడిగాడు.

ఉదయనుడు ఆ ప్రశ్నకు సమాధానం చెప్ప నిరాకరించాడు. దానినిబట్టే పద్మావతి, ఆయన వాసవదత్తను ఎక్కువగా ప్రేమించాడని అర్థంచేసుకున్నది. తరవాత వసంతకుడు రాజు నోటితోనే ఆ మాట చెప్పించాడు కూడా. అది విని వాసవదత్త, "ఆహా, ఇన్ని కష్టాలు పడ్డందుకు ఈ ప్రతిఫలం చాలు!" అనుకున్నది.

పద్మావతి దాసిమాత్రం, "చూడవమ్మా, మహారాజుగారు ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నారో!" అన్నది.

"సుగుణవతి అయిన వాసవదత్తాదేవిని ఆయన ఇప్పటికీ మరిచిపోకుండా ఉండటం గొప్పవిషయం కాదుటే!" అన్నది పద్మావతి.

వాసవదత్త వెంటనే పద్మావతితో, "అమ్మా, ఎంత ఉత్తమురాలివో నీ మాటలే చెబుతున్నాయి!" అన్నది. తరవాత ఆమె పద్మావతిని రాజు ఉన్నచోటుకి పంపేసి తాను అవతలికి వెళ్ళిపోయింది.



కొద్దిరోజులు గడిచాయి. పద్మావతి శిరోవేదనతో బాధపడుతూ సముద్ర గృహంలో పడుకుంటాననీ, అవంతికను పిలుచుకు రమ్మనీ, ఆమె చక్కని కథలు చెప్పి తన బాధ నయంచేస్తుందనీ దాసిలతో చెప్పింది. రాజును పిలుచుకు రమ్మని ఒక దాసి వెళ్లి వసంతకుడితో కూడా చెప్పింది.

ఉదయనుడూ విదూషకుడూ సముద్ర గృహానికి వచ్చేసరికి అక్కడ ఎవరూ లేరు, పక్క మాత్రం ఉన్నది. ఉదయనుడు పక్కమీద పడుకుని, పద్మావతి వచ్చేదాకా ఏవైనా కథలు చెప్పమన్నాడు. విదూషకుడైన వసంతకుడు ఏదో చెబుతూండగా రాజుకు నిద్ర వచ్చేసింది. అదిచూసి వసంతకుడు లేచి వెళ్ళిపోయాడు.

త్వరలోనే వాసవదత్త అక్కడికి వచ్చింది. గదిలో ఒక్క చిన్న దీపం మాత్రమే వెలుగుతున్నది. ఆ వెలుగులో ఆమె తన భర్తను పక్కమీద చూసి పద్మావతి అని భ్రమపడింది. "ఒక గుడ్డిదీపం ఉంచి, ఆమెను ఒంటరిగా విడిచి అందరూ వెళ్ళిపోయారు!" అనుకుంటూ ఆమె వెళ్లి పక్కమీద కూచున్నది. ఇంతలో ఉదయనుడు నిద్రలో, "వాసవదత్తా! వాసవదత్తా!" అని పిలిచాడు.

వాసవదత్త చివాలున లేచి నిలబడి, "ఇది నా భర్త! పద్మావతి కాదు! అయ్యో,



ఆయన నన్ను చూడలేదు గద, చూస్తే యౌగంధరాయణుడి పథకమంతా పాడై పోతుంది. నేను జీవించి ఉన్నానని తెలిస్తే దర్శక మహారాజు నా భర్తకు సహాయం చెయ్యడు!" అనుకున్నది.

కాని ఆమె అక్కడినుంచి వెళ్ళిపోలేదు. అక్కడ ఎవరూ లేరు గనక తన భర్తను తనివితీరా చూద్దామని ఉండిపోయింది. అంతేకాదు, నిద్రలో ఉదయనుడు తనతో మాట్లాడుతూంటే తానా మాటలకు సమాధానంకూడా చెప్పింది. ఆఖరుకు తానక్కడ ఉండటం భావ్యంకాదని తోచినాకకూడా తన భర్త బయటికి చాచిన చేతిని భద్రంగా మంచంమీద పెట్ట యత్నించింది. ఆమె వెళ్ళిపోతూండగా ఉదయనుడు కళ్ళు తెరిచి, "ఆగు, వాసవదత్తా, ఆగు!" అని కేక పెట్టాడు; ఉదయనుడు లేచి ఆమె వెళ్ళిన దిక్కుగా పరిగెత్తి, తలకు తలుపు తగలగానే తాను ఒకవేళ కల గన్నానేమో నని అనుమానించాడు.

ఇంతలో వసంతకుడు వచ్చి రాజు చెప్పినదంతా విని, అదంతా కలే అయి ఉంటుందన్నాడు.

ఆరుణితో యుద్ధానికి ఉదయనుడి మంత్రి అయిన రుమణ్వంతుడు సైన్యాలను ఆయత్తం చేసుకుని వచ్చాడు. దర్శక



మహారాజు తన సైన్యాలను కూడా సిద్ధం చేసి, ఈ సేనలన్నిటికీ నాయకత్వం వహించమని కోరుతూ ఉదయనుడికి కబురు పంపాడు. ఉదయనుడు పక్కమీది నుంచి లేచి వెళ్ళిపోయాడు.

యుద్ధంలో వత్సరాజు గెలిచి, పోయిన తన రాజ్యాన్ని తిరిగి సంపాదించుకున్నాడు. తలవని తలంపుగా అతని వీణ ఘోషవతి కూడా దొరికింది. దానిని ఎవరో నర్మదా తీరాన చూసి పట్టుకువచ్చి కౌశాంబీ రాజసౌధం దగ్గిర మోగిస్తుంటే ఉదయనుడు విని గుర్తించాడు. ఘోషవతిని చూడగానే అతనికి వాసవదత్త జ్ఞాపకం వచ్చి దుఃఖం ఆగలేదు.

అదే సమయానికి ఉజ్జయినినుంచి ప్రద్యోతుడు రెండు బొమ్మలు పంపాడు. అవి వాసవదత్తా ఉదయనులవి; వాటిని పెట్టి ఉజ్జయినిలో వివాహకాండ జరిపించారు. వాసవదత్త బొమ్మను చూస్తూనే పద్మావతి అవంతికను పోల్చుకుని, "వాసవదత్తాదేవికీ ఈ బొమ్మకూ పోలికలున్నాయా?" అని భర్తనడిగింది.

"పోలిక లుండటం కాదు, ఈ బొమ్మ అచ్చు వాసవదత్తే," అన్నాడు ఉదయనుడు. పద్మావతి తొట్రుపడుతూ, "ఇలాటి స్త్రీ ఇక్కడే ఉన్నది," అన్నది. వెంటనే అవంతికను పిలుచుకురమ్మని ఉదయనుడు కోరాడు. పద్మావతి వెళ్ళి అవంతికను తెచ్చింది.

బ్రాహ్మణ వేషంలో యౌగంధరాయణుడు కూడా అక్కడికి వచ్చాడు.

నిజం బట్టబయలయింది. యౌగంధరాయణుడు తాను ఎందుకీ నాటకమంతా ఆడినదీ వివరించి రాజును క్షమాపణ కోరాడు. ఉదయనుడు క్షమాపణ నిరాకరించి ఆయనకు తన కృతజ్ఞత తెలిపాడు.

తరవాత ఉదయనుడు తన ఇద్దరు భార్యలతో సుఖంగా ఉన్నాడు.



# చెడ్డ శిష్యుడు

ఒక రాజ్యంలో పేరుమోసిన వస్తాదు ఒకడుండేవాడు. అతడి దగ్గిర మల్లవిద్య నేర్చుకునేందుకు అనేక ప్రాంతాలనుంచి యువకులు వస్తూండేవారు. వస్తాదుకు నూట నలభైఒక్క కుస్తీపట్లు తెలుసు. వాటిలో నూట నలభై పట్లను తన శిష్యుల్లో మంచివాడని భావించినవాడికొకడికి నేర్పాడు. కొన్నాళ్ళ తరవాత ఆ శిష్యుడు రాజుగారి దగ్గిరకు పోయి, "మహారాజా! రాజ్యంలో నన్ను మించిన వస్తాదు మరొకడు లేడు. ఆఖరికి నాకు విద్య చెప్పిన గురువునైనా సరే ఓడించగలను. కాని, ఆయన ముసలివాడు కావటంవల్లా, నాకు విద్య నేర్పిన వాడవటంవల్లా కృతజ్ఞతకొద్దికి ఆయనమీద సవాలు చేయదలచలేదు," అన్నాడు.

శిష్యుడి మాటలు వింటూనే రాజుగారికి మండిపోయింది. అంత విద్య నేర్పిన గురువుపై కృతజ్ఞతాభావం లేనందుకు అతణ్ణి కొప్పడి, "అయినా, నీ మాటల్లో వున్న నిజం ఎంతో తెలిసిపోతుంది. మీ ఇద్దరికీ కుస్తీ ఏర్పాటుచేశాను," అన్నాడు.

గురుశిష్యుల కుస్తీ చూసేందుకు చాలామంది జనం వచ్చారు. యువకుడూ, బలశాలీ అయిన శిష్యుడు ఏనుగుపిల్లలా ముసలి గురువుమీదికి దూకాడు. గురువుకు తను బలంలో శిష్యుడికి తీసికట్టని తెలుసు. అందువల్ల అతడు శిష్యుడికి నేర్పకుండా వదిలిన ఆ ఒక్క కుస్తీపట్టు ప్రయోగించి, అతణ్ణి గాలిలోకి ఎత్తి దూరంగా విసిరివేశాడు.

"ఈ పట్టు నువ్వు నాకు నేర్పలేదు, ఇది అన్యాయం!" అన్నాడు శిష్యుడు, పడ్డచోటునుంచి లేచి మన్ను దులుపుకుంటూ.

"ఇలాంటి సమయం రావచ్చునే దాన్ని నీకు నేర్పలేదు," అన్నాడు ముసలిగురువు. రాజూ, చూడవచ్చిన ప్రజలూ గురువును మెచ్చుకున్నారు.





# ప్రతీకారం

వజ్రగిరి రాజైన విక్రమసింహుడికి పద్మముఖి అనే కుమార్తె ఉండేది. ఆమె అసమాన సౌందర్యవతి అని దేశదేశాలా పేరు మోసింది. ఆమెను పెళ్ళాడాలని నానా దేశాల రాజకుమారులు ప్రయత్నించారు. వారిలో రత్నగిరి రాజకుమారుడైన ఇంద్రవర్మను మాత్రమే ఆమె పెళ్ళాడ నిశ్చయించింది.

ఆమెను పెళ్ళాడగోరిన వారిలో శృంగపురపు రాజైన కాలకేతుడు కూడా ఉన్నాడు. అతని తల్లి అతనితో, "నాయనా, నీకు పద్మముఖి వంటిదే భార్య కావాలి. అందుచేత నీవు వెళ్ళి విక్రమసింహుడితో మాట్లాడు. నీ సంబంధానికి వారు తప్పక ఒప్పుకుంటారు!" అని ప్రోత్సహించి పంపింది. కాలకేతుడు వజ్రగిరికి వచ్చి తన కోరికను విక్రమసింహుడికి తెలుపుకున్నాడు. విక్రమసింహుడు అతని కోరిక నిరాకరించాడు.

కాలకేతుడు తల వంచుకుని వచ్చిన దారినే వెళ్ళిపోయాడు. ఆ తరవాత విక్రమసింహుడు రత్నగిరి నుంచి ఇంద్రవర్మను పిలిపించి, పద్మముఖిని అతనికి ప్రదానం చేశాడు. ఇంద్రవర్మ సంతోషంతో రత్నగిరికి తిరిగివచ్చి పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఇంతలో కొండరాజు దండులు వచ్చి రత్నగిరిపై దాడిచేశాయి. రత్నగిరి బలాలు వీరోచితంగా పోరాడినప్పటికీ విజయం అనుమానాస్పదంగా కనబడింది. అందుచేత ఇంద్రవర్మ తన కాబోయే మామగారికి కబురుచేసి సహాయం అడిగాడు. వెంటనే వజ్రగిరినుంచి విక్రమసింహుడూ, ఆయన కొడుకు శక్తిసింహుడూ తమ బలాలతోసహా కదిలి ఇంద్రవర్మకు సహాయం వెళ్ళారు.

ఈ సంగతులన్నీ శృంగపురంలో తెలిశాయి. కాలకేతుడితో అతని తల్లి, "నాయనా,

ఆర్. కామేశ్వరరావు



ఇప్పుడు వజ్రగిరి కోటకు రక్షణ ఏమీ లేదు. నీవు కొద్ది బలాలతో వెళ్ళి కోటను వశపరుచుకుని పద్మముఖిని ఎత్తుకురా. మీకిద్దరికీ ఇక్కడే పెళ్ళిచేసి ఆ విక్రమసింహుడికి గట్టి ప్రాయశ్చిత్తం చేస్తాం!" అన్నది.

తల్లి సలహాప్రకారం కాలకేతుడు వజ్రగిరికి వెళ్ళి బలాత్కారంగా పద్మముఖిని బందీనిచేసి శృంగపురానికి తెచ్చాడు. అతను వెళ్ళిన పని సాధించుకు వచ్చినందుకు అతని తల్లీ, చెల్లెలు ఇందుమతీ ఎంతగానో సంతోషించారు.



ఈ లోపల రత్నగిరివద్ద జరిగిన యుద్ధంలో విక్రమసింహుడు ప్రాణాలు కోల్పోయాడు, ఇంద్రవర్మ రాజ్య భ్రష్టుడయాడు. ఈ వార్తకూడా శృంగపురానికి వచ్చి చేరింది. ఈ పరిస్థితిలో చంద్రముఖి కాలకేతుణ్ణి తప్పక పెళ్ళాడుతుందని అందరూ అనుకున్నారు. కాని చంద్రముఖి అతన్ని పెళ్లాడటానికి ఎంతమాత్రమూ ఒప్పలేదు. "నేను పెళ్ళాడితే ఎప్పటికైనా ఇంద్రవర్మనే పెళ్ళాడతాను! అలా జరగకపోతే సన్యాసినిగా జీవిస్తానుగాని మరొకరిని ఎన్నటికీ పెళ్ళాడను!" అన్నది.

కాలకేతుడు అభిమానం కలవాడు. అతని తల్లి వారిద్దరికీ బలాత్కార వివాహం చేయ తలపెట్టింది, కాని అందుకతను సమ్మతించలేదు; "ఏనాటికైనా ఆమె ఇష్టంమీదనే పెళ్ళాడతాను," అన్నాడు.

అతని తల్లి చంద్రముఖిని నయాన వంచలేక భయపెట్ట జూసింది, కాని చంద్రముఖి భయపడలేదు. అందుచేత ఆమె చంద్రముఖితో, "నీవు నా కోడలివై నీ మర్యాద దక్కించుకుంటా వనుకున్నాను. అందుకు సమ్మతించావు కావు గనక ఇకనుంచీ నీవు మా దాసివి మాత్రమే," అంటూ ఆమెచేత అడ్డమైన చాకిరీ చేయించసాగింది.

చంద్రముఖి నిద్ర లేచినది మొదలు రాత్రి ఎంతో పొద్దుపోయినదాకా బట్టలు



ఉతకటమూ, వంట చెయ్యటమూ, అంట్లు తోమటమూ మొదలైన పనులు చేసి, ఒక మూల పడుకుని నిద్రపోయేది. ఇవి చెయ్యటానికైనా ఆమె ఒప్పుకున్నది గాని కాలకేతుణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకోలేదు.

తల్లి ఆమెను ఇలా చూడటం కాలకేతుడికిగాని, అతని చెల్లెలైన ఇందుమతికిగాని ఇష్టంలేదు. ఇందుమతి పైకేమీ అనలేదు; కాలకేతుడు మాత్రం తల్లితో, "అమ్మా, ఆ పిల్ల రాజకుమార్తె. ఆమెను గౌరవంగా చూడటం మనకే గౌరవం!" అన్నాడు. కాని తల్లి, "నీకు తెలియదురా, నాయనా! దానికి మనమీద పిసరంత గౌరవం లేదు. దానికి బుద్ధి రావాలంటే ఇదే దారి. ఎప్పటికైనా దాన్ని నీ భార్య చేసి తీరుతాను, చూస్తూ ఉండు!" అన్నది. కాలకేతుడు తల్లికి మారాడలేదు.

చంద్రముఖి మూడేళ్ళపాటు ఈ యమ చర అనుభవించింది. ఆమె విచారంతోనూ, చాకిరితోనూ చిక్కి శల్యమయింది. ఒక నాటి ఉదయం ఆమె బట్టలు తీసుకుని ఉతకటానికి నది వద్దకు వెళ్ళింది. నదికి దిగువగా కొంత దూరంలో ఒక తెప్ప కదులుతూ ఉండటం ఆమె మొదటనే చూసింది. అయితే ఆమె ఒక్కొక్క బట్టే ఉతికి ఒడ్డున పెడుతూ మధ్యలో తలఎత్తి



చూసేసరికి ఆ తెప్ప తనకు చాలా సమీపంలో కనబడింది. ఆ తెప్పలో ఇద్దరు మనుషులున్నారు. ఆమె లేచి నిలబడి వారికేసి ఆశ్చర్యంతో చూడసాగింది. ఎందుకంటే ఆ తెప్పలో ఉన్నది తన తమ్ముడైన శక్తిసింహుడూ, తనకు భర్త కావలసి ఉండిన ఇంద్రవర్మా.

వారుమాత్రం ఆమెను గుర్తించలేదు. శక్తిసింహుడు ఆమెతో, "అమ్మా, ఇది కాలకేతుడు ఏలే శృంగపురం కాదా?" అన్నాడు. అవునన్నది చంద్రముఖి.

"కొంతకాలం క్రితం వారు వజ్రగిరి రాజు కూతురు పద్మముఖిని ఎత్తుకువచ్చారు. ఆమె బతికి బాగున్నదా?" అని శక్తిసింహుడు మళ్ళీ అడిగాడు.

"బాగానే ఉన్నది. మహారాణి కావటానికి ఇష్టంలేక బట్టలు ఉతుకుతూ, రాజ కుటుంబానికి ఊడిగం చేస్తున్నది!....నన్ను గుర్తించలేదా, శక్తి?" అన్నది చంద్రముఖి.

శక్తిసింహుడు అక్కను కౌగలించుకుని ఏడ్చాడు. ఇంద్రవర్మకు కూడా కళ్లు చెమ్మగిల్లాయి. ఆమె వారిద్దరికీ జరిగిన సంగతి అంతా చెప్పింది.

"అయిందేదో అయింది. ఇక మన కష్టాలు గట్టెక్కినట్టే. కొండరాజును అందరమూ కలిసి ఓడించాం. ఇప్పుడు రత్నగిరికి



ఇంద్రవర్మే రాజు. నీ జాడ తెలిసేదాకా ఆతను రాజ్యాభిషేకం చేసుకోదలచలేదు. మేము సైన్యంతోనే వచ్చాం. కాని నీక్షేమం కోరియుద్ధం ప్రకటించలేదు. నీవు కనిపించావు గనక యుక్తితో శత్రువును లోబరుచుకుంటాం!" అన్నాడు శక్తిసింహుడు.

"శక్తీ, మనకు యుద్ధంతో పనిలేదు సరికదా, యుక్తితోనూ పనిలేదు. చంద్రముఖిని ఈ తెప్పలోనే ఎక్కించుకుని వచ్చినదారే పోదాం!" అన్నాడు ఇంద్రవర్మ.

"అందులో ప్రతీకారం ఏమున్నది, ఇంద్రా? నా సోదరిని ఇంత చేసిన ఆ రాక్షసినీ, దాని వంశాన్నీ విడిచిపుచ్చుతామా? అది కల్ల!...రేపు జాము పొద్దెక్కేసరికి ఆకస్మికంగా కోటపై వచ్చి పడతాం. మేము వచ్చేదాకా ఎలాగో ఆత్మరక్షణ చేసుకో!" అని శక్తిసింహుడు తన అక్కతో అన్నాడు. తెప్ప వెళ్ళిపోయింది.

"నా దుర్దినాలు అంతరించాయి. ఇక నేను దాసిని కాను. ఒక రాజకుమారుడి అక్కను, మరొక రాజుకు కాబోయే భార్యను!" అంటూ చంద్రముఖి తాను తెచ్చిన బట్టలన్నీ నదిలో గిరవాటువేసి ఇంటికి తిరిగి వెళ్ళిపోయింది.

ఆమెను చూస్తూనే రాజమాత, "ఇంత సేపు బట్టలు ఉతకటమా? మిగతా పను



లన్నీ ఎప్పుడు చేద్దామనుకున్నావు? నీకు గట్టిగా బుద్ధి చెప్పాలి," అన్నది.

"నాతో మర్యాదగా మాట్లాడు!" అన్నది చంద్రముఖి కొరడాతో కొట్టినట్టు.

"నీకింత పొగరా?" అంటూ రాజమాత చంద్రముఖిని కొట్టించటానికి భటులను పిలిచింది. చంద్రముఖి ఆమెతో, "నేను రేపే రాణిని కావటానికి నిశ్చయించాను. ఇప్పుడు నామీద ఎవరన్నా చెయ్యి చేసుకున్నారో రేపు తప్పక వారి ప్రాణాలు తీసేయిస్తాను, జాగ్రత్త!" అన్నది.

ఈ మాటలు వినగానే రాజమాతకు ఎక్కడ లేని ఆనందమూ పొంగివచ్చి కాలకేతుడికి కబురుచేసింది. అతను కూడా చంద్రముఖి తనను పెళ్ళాడటానికి ఎలాగైతేనేం ఒప్పుకున్నదిగదా అని సంతోషించి మర్నాడు వివాహం జరపుకోటానికి ఏర్పాట్లు ప్రారంభించాడు.

మర్నాడు తెల్లవారింది. రాజ ప్రాంగణమంతా పెళ్ళి సన్నాహంలో సందడిగా ఉన్నది. జాము పొద్దెక్కింది. భటులు రొజుకుంటూ వచ్చి రాజభవనంముందు యుద్ధం జరుగుతున్నదనీ, పెద్ద సేన వచ్చి దాడి చేసిందనీ చెప్పారు. రాజభవనంలో ఉన్న పురుషులందరూ రాజుగారి వెంట శత్రు సైన్యాన్ని ఎదుర్కొనటానికి పరిగెత్తారు.



ఆడవాళ్ళందరూ అంతఃపురంలో నక్కి భయంతో వణుకుతున్నారు. యుద్ధ కోలాహలం అంతకంతకూ దగ్గిరిగా వినవస్తున్నది. మధ్యమధ్య సైనికులు వచ్చి అపజయ వార్తలు తెలుపుతున్నారు. కాలకేతుడు మరణించిన వార్తకూడా వచ్చింది. రాజమాత ముఖం భయంతో పాలిపోయింది.

కొద్దిసేపట్లో ఒక సేనాపతి అక్కడికి వచ్చాడు. అతను స్త్రీజనంకేసి నిశితంగా చూసి, "మీలో చంద్రముఖీదేవి ఎవరు? ఆమెనూ, ఆమె దాసీలనూ తప్ప మిగిలిన అందరు స్త్రీలనూ తల తీయమని శక్తిసింహ మహారాజు ఉత్తరువు!" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. ఇందుమతి మాత్రం చంద్రముఖికేసి ఒకసారీ, సేనానికేసి ఒకసారీ చూసి తల వంచుకున్నది.

చంద్రముఖి ఒక్క అడుగు ముందుకు వచ్చి, "నేనే చంద్రముఖిని. ఇక్కడ ఉన్న స్త్రీలంతా నా దాసీలే!" అన్నది. సేనాని వంగి ఆమెకు నమస్కారం చేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అతనివెంట ఉన్న సైనికుడు రాజమాత మొదలుకొని దాసీదాని వరకూ అందరికీ సంకెళ్ళు తగిలించి తీసుకుపోయాడు.

తరవాత కొద్దిరోజులకే ఇంద్రవర్మ చంద్రముఖిని పెళ్ళాడి రాజ్యాభిషేకం చేసుకున్నాడు. చంద్రముఖి తన తమ్ముడికి ఇందుమతిని చూపించి, "ఈ పిల్ల నన్ను తన వదినెగా చేసుకోవాలని ఎంతో ఉబలాట పడింది. నాకు ఏనాడూ కొంచెంకూడా బాధ కలిగించలేదు. ఈమెను నువ్వు పెళ్ళాడితే నేను సంతోషిస్తాను!" అన్నది. శక్తిసింహుడు ఇందుకు సమ్మతించి ఇందుమతిని పెళ్ళాడి వజ్రగిరికి రాణిని చేశాడు.

కాలకేతుడి తల్లి మాత్రం బతికి ఉన్నంత కాలమూ ఊడిగం చేసింది. ఆమెకు చంద్రముఖి సరి అయిన ప్రతీకారం చేసింది.



# పేదవాడి బరువు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ సహనం నిజంగా నిరుపమానం. నిన్ను చూస్తే వెనకటి మిత్రవిందుడనే బెస్తవాడు జ్ఞాపకం వస్తున్నాడు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు మిత్రవిందుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం తూర్పు సముద్ర తీరాన మిత్రవిందుడనే పల్లెవాడుండేవాడు. వాడు చాలా పేదవాడు. రోజూ సముద్రంమీదికి తెప్పలో వెళ్ళి చేపలు పట్టి తెచ్చి వాటితో తన భార్యనూ, అయిదుగురు బిడ్డలనూ పోషిస్తూ ఉండేవాడు. సముద్రంలో ఒక్క చోటనే చేపలు దొరికేవి. వాడికి ఆ స్థలం తెలుసును, అందుచేత ఎంత గాలివానలోనైనా సరే

## బేతాళ కథలు




అక్కడికే వెళ్ళి చేపలు తెచ్చుకునేవాడు. వాడి ఆర్జన కుటుంబం పోషించటానికి బొటా బొటీగా సరిపోతూ ఉండేది. అందువల్ల ఏనాడైనా వాడికి చేపలు దొరక్కపోతే ఆనాడు వాడూ, భార్యా, పిల్లలూ పస్తులు పడుకోవలిసి వచ్చేది.

ఈ విధంగా మిత్రవిందుడు రోజూ సముద్రంతో ఘర్షణపడుతూ అతి కష్టంమీద సంసారం ఈదుకొస్తున్నాడు. వాడికి ఇతర పల్లెవాళ్లుకూడా సాయం లేరు. ఎందుకంటే, అది పదిమంది పల్లెవాళ్లకు భుక్తి ఇవ్వగల తీరం కాదు. వాడి భార్య ఒక్కతే వాడికి సమస్తమూనూ. ఆమె వాడి వలలు బాగు



చేసేది, గాలాలు జాగ్రత్తపరిచేది. తన భర్త సముద్రం మీదికి వెళ్ళి ఇంటికి వచ్చేదాకా, "నా మొగుడు ఎంత కష్టపడుతున్నాడు! ఏమైపోతాడో!" అనుకుని ఆరాటపడేది.

మిత్రవిందుడు కూడా ఇల్లు బయలుదేరినది మొదలు ఇంటికి వచ్చేదాకా తన భార్య అస్తమానం పడే శ్రమను గురించి ఆలోచించుకుని జాలిపడేవాడు; తన భార్యనూ పిల్లలనూ ఇంకా ఎక్కువ సుఖపెట్టలేనందుకు విచారించేవాడు.

భార్యాభర్తలిద్దరూ మంచి హృదయం గలవాళ్ళు.

ఒకసారి ఆ సమీపంలో ఉండే ఒక పేదవాడు చనిపోయాడు. వాడి భార్యా, ఇద్దరు పిల్లలూ బొత్తిగా దిక్కులేనివాళ్ళయిపోయారు. మిత్రవిందుడు వాళ్ళకోసం తన ఇంటికి కొంత దూరంలో ఒక గుడిసె వేసి ఇచ్చాడు. అంతకంటె వాడు ఆ అనాథులకు ఏమీ చెయ్యలేకపోయాడు. ఆ అనాథ స్త్రీ తన ఇద్దరు పిల్లలనూ తనకు చాతనయినట్టు సాకుతూ వచ్చింది.

కొద్ది రోజులు గడిచాయి. ఒకనాడు మిత్రవిందుడు తెప్ప వేసుకుని బయలుదేరగానే పెద్ద గాలివాన సాగింది. మిత్రవిందుడి భార్య చీకటి పడగానే పిల్లలందరికీ ఇంత



గంజి కాచి పోసి, వాళ్ళని వెచ్చగా పడుకో బెట్టి భర్తకోసం ఎదురుచూస్తూ కూచున్నది. తమకోసం అంత తుఫానులోకూడా తన భర్త సముద్రంమీద శ్రమ పడుతూండటం తలుచుకుంటే ఆమె గుండె కరిగి నీరయింది. పిల్లలు పెద్దవాళ్ళయి కాస్త చేతికి అందివస్తే తన భర్తకు కొంత శ్రమ తగ్గుతుండిగదా అనుకున్నది.

అర్ధరాత్రి అయినా మిత్రవిందుడు తిరిగి రాలేదు. ఆమెకు భయం జాస్తి అయింది. ఆమె ఒక చిన్న దివిటీ తయారుచేసుకుని దానిని వెలిగించి పట్టుకుని సముద్ర తీరానికి బయలుదేరింది.

మధ్యదారిలో ఆమెకు అనాథస్త్రీ ఉండే గుడిసె తగిలింది. గుడిసె వాకిలి తలుపు గాలికి అటూ ఇటూ కొట్టుకుంటూ ఉండటం చూసి ఆశ్చర్యపడి, మిత్రవిందుడి భార్య తన దివిటీతోసహా ఆ గుడిసెలోకి అడుగు పెట్టింది. మరుక్షణమే గుడిసె మధ్యను పడి ఉన్న అనాథస్త్రీ శవం కానవచ్చింది. కప్పులో కంతలుండటంచేత ఆ శవం ముఖాన వాననీరు పడి ఆ దిక్కులేని మనిషి కన్నీరులాగా కిందికి కారుతున్నది.

ఒక పక్కగా వాన కురవని చోట ఒక గంపలో గుడ్డలలో పడుకుని ఆమె బిడ్డ లిద్దరూ కనిపించారు. వారు నిశ్చింతగా నిద్ర



పోతూ నిద్రలో నవ్వటం మిత్రవిందుడి భార్య చూసింది.

ఆమెకా బిడ్డలను చూడగానే గుండె గుభేలుమన్నది. అదివరకే తండ్రిని పోగొట్టుకున్న బిడ్డలకు ఇప్పుడు తల్లికూడా లేకుండా పోయింది. అశుభమూ శుభమూ ఎరగని ఆ పిల్లలకు తమకు రాబోయే కష్టాలేవీ తెలియవు గద! ఇక వాళ్ళకు దిక్కెవరు? వీరు కూడా తల్లిలాగే దిక్కులేని చావు చావవలసిందేనా?

ఈ మాట అనుకోగానే ఆమెకు తన అయిదుగురు పిల్లలూ జ్ఞాపకం వచ్చారు. ఆమె ఇంకేమీ ఆలోచించక ఆ ఇద్దరు పిల్లలనూ గంపలోనుంచి ఎత్తి గుడ్డలలో చుట్టి భద్రంగా పట్టుకుని తన ఇంటికి వచ్చేసి, నిద్రపోయే తన పిల్లల పక్కనే ఆ ఇద్దరినీ కూడా పడుకోబెట్టింది. అప్పటికిగాని ఆమెకు తన భర్త జ్ఞాపకం రాలేదు.

సముద్రపు హోరు తుఫాను హోరులో కలిసి వినవస్తున్నది. మధ్యమధ్య తరగలు ఫెళఫెళా విరిగి పడుతున్న చప్పుడవుతున్నది. అయిదుగురు పిల్లల్ని పెంచటానికే ఇన్ని ఇక్కట్లు పడుతున్న తన భర్త ఇంకా ఇద్దర్ని తెచ్చినందుకు మండిపడతాడేమో! అతను ఇంటికి వచ్చి తనను చితకతన్నినా తప్పు లేదనుకున్నది. భర్తచేత తన్నులు



తినవలసి వస్తుందన్న భయంకంటె అతను ఇంటికి తిరిగి రాడేమోనన్న భయం ఆమెకు జాస్తి అయింది.

తూర్పు తెల్లవారుతుండగా మిత్రవిందుడు ఇంటికి చేరి తలుపు తట్టాడు. భార్య తలుపు తెరిచి బయటికి వచ్చి తడిసి ముద్ద అయిఉన్న తన భర్తను చూసి, "ఎంతసేపటికీ రాకపోతే ఏమైనావో అని భయపడి చస్తున్నాను," అన్నది.

"ఎంత గాలి! ఎంత వాన! ఈ వానలో నువ్వూ పిల్లలూ ఎట్లా ఉన్నారోనని నాకు ఒకటే దిగులు! ఒక్క చేప దొరకలేదు. వలంతా చిరిగిపోయింది. తెప్పకట్టు తాడు కాస్తా తెగింది. అయితే అయిందిలే! అన్నిటికీ దేవుడే ఉన్నాడు!" అన్నాడు మిత్రవిందుడు నిశ్చింతగా.

"పాపం, ఆ దిక్కులేని ఆడమనిషి రాత్రి చచ్చిపోయింది. ఇద్దరు పిల్లలూ కళ్ళు తెరవని కూనలు! పాపం వాళ్ళగతి ఏంకాను?" అన్నది భార్య.

మిత్రవిందుడు ఆదుర్దాగా, "అయ్యో, పాపం! వెంటనే వెళ్లి వాళ్ళను తీసుకురా. అయిదుగురికి ఏడుగురవుతారు. మనకు గంజి ఇచ్చిన రోజున దేవుడు వాళ్ళకివ్వక పోతాడా? అవసరమైతే ఇంతకన్న ఇంకా ఎక్కువ శ్రమపడి ఏదోవిధంగా పోషిస్తాను!"



అన్నాడు. భార్య కదలకపోవటం చూసి వాడు, "ఏమిటి అట్లా అనుమానిస్తున్నావు? వెంటనే వెళ్ళి ఆ పిల్లల్ని తీసుకురా!" అని మళ్ళీ అన్నాడు.

"నేనేమీ అనుమానించటం లేదు. లోపలికి వచ్చి చూడు!" అన్నది భార్య.

భార్య ఆ దిక్కులేని పిల్లలను అదివరకే ఇంటికి తెచ్చినందుకు మిత్రవిందుడు పరమానంద భరితుడైనాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మిత్రవిందుడు మూఢుడా, లేక దారిద్ర్యబాధ ఎలాటిదో నిజంగా గ్రహించనివాడా? ఉన్న సంసారాన్నే ఈదటానికి నానా అగచాట్లూ పడుతూ అనాథ శిశువులను కూడా ఎందుకు చేరదీయటానికి సిద్ధపడ్డాడు? భగవంతుడి మీద భారం వేసినవాడైతే ఆ శిశువులను రక్షించే భారం భగవంతుడిపైనే వేసి ఊరుకోవచ్చుగా? తన భారం పెంచుకోవడం దేనికి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మిత్రవిందుడు మూఢుడు కాడు. మూఢుడైనవాడు తన భార్యనూ, బిడ్డలనూ పోషించటానికి అంత శ్రమ పడడు. తుఫానులో తెల్లవార్లూ కొట్టుకుని ఒక్క చేపకూడా దొరకక వలలు తెంచుకుని వచ్చినవాడికి దారిద్ర్యబాధ బాగానే తెలుసు. వాడు తన ప్రయత్నం తన కుటుంబ పోషణకు చాలని కారణంచేత భగవంతుడిపైన భారం వేశాడేగాని, భగవంతుణ్ణి నమ్ముకుని ముక్కు మూసుకుని కూచున్నవాడు కాడు. తన పిల్లల క్షేమం కోసం అలా ఒళ్ళు దాచుకోకుండా పనిచేసేవాడు ఇతర పిల్లలను ఎన్నడూ దేవుడి దయకు వదలలేడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)






మేష్టరు: మన నాటకంలో, భీముడి పాత్ర
ఎవరు వేస్తారు?
సుబ్బయ్య: నేను, సార్!




"ఏమయ్యా, నోరు వినుదుకుంటున్నావు?"
"ఊదుకు కాఫీ తాగాను."




"అదృష్టవంతుడివి! ఆస్పత్రి చేరువలో వున్నది."




పూర్వం పాటలీపుత్రంలో ఉగ్రసేనుడనే మహావీరుడైన రాజు ఉండేవాడు. ఆయన కింద ఉండే సామంతు లందరూ యోధాన యోధులే. అందుచేత ఉగ్రసేన మహారాజును చూస్తే శత్రువులకు సింహస్వప్నంగా ఉండేది. అయితే ఆయనకుగల సామంతులలో అవినీతిపరులూ, ప్రజాపీడకులూ అయినవారు కొంద రుండేవారు. రాజుగారి అభిమానానికి పాత్రులైన కారణంగా వారు నిరంకుశంగా ప్రవర్తించసాగారు.

ఉగ్రసేనుడిపట్ల అమిత విశ్వాసం గల చిల్లరయోధులలో సహదేవుడనే యువకుడు ఒకడున్నాడు. దుష్టులైన సామంతులు తమ దుర్మార్గాలతో మహారాజు పరిపాలనకు తీరని కళంకం తెచ్చిపెడుతున్నా రనిపించి ఈ యోధుడు ప్రజలను కాపాడటానికీ, దుర్మార్గులను శిక్షించటానికీ కంకణం కట్టుకుని, ప్రజాపీడకు లందరినీ దోచటమూ, చిక్కినప్పుడల్లా శిక్షించటమూ సాగించాడు. దానితోబాటు తాను కొల్లగొట్టినది పేదప్రజలకు పంచుతూ వచ్చాడు.

సహదేవుడు గజదొంగలాగా తయారయాడని ఫిర్యాదులు రాగానే మహారాజు అతనిని పట్టుకునేటందుకు భటులను పంపాడు. అయితే సహదేవుడు వారికి అందకుండా తిరుగుతూ రహస్యజీవితం గడపసాగాడు. దానిమీదట మహారాజు సహదేవుణ్ణి గజదొంగగా ప్రకటించి, రాజ్యంలో ప్రతి పౌరుడికీ అతనిని చంపే అధికారం ఇచ్చేశాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాటి రాత్రి ఉగ్రసేన మహారాజుకు కలలో ఒక దేవత కనిపించి, "రాజా, లే! వెళ్ళి దొంగతనం చేసిరా! ఇది ఈశ్వరాజ్ఞ!" అన్నది. మహారాజు ఉలిక్కిపడి లేచి ఈ విపరీతమైన కలను స్మరించి అశ్చర్యపడ్డాడు. కాని ఆయన మళ్లీ కన్ను మూశాడో లేదో, అదే

జి. సత్యనారాయణరావు

దేవత మళ్లీ కనిపించి, "రాజా, నీవు వెళ్ళి దొంగతనం చేసి రాకపోయావో, నీకు రాజ్యమూ, ప్రాణమూకూడా దక్కవు! ఇది ఈశ్వరాజ్ఞ!" అన్నది.

రెండుసార్లు వచ్చిన ఈ కలను గురించి ఏమనుకోవాలో మహారాజు నిశ్చయించ లేకపోయాడు. ఆయన మళ్ళీ నిద్రపోవటానికి యత్నించేసరికి, మూడవసారి మళ్ళీ అదే కల వచ్చింది. ఇందులో ఏదో దైవప్రేరణ ఉన్నదనీ, ఆ దేవత అజ్ఞప్రకారం దొంగతనం చేసి తీరాలనీ మహారాజు నిర్ణయించుకుని, పక్కమీదినుంచి లేచి చప్పుడు కాకుండా భవనం వెలపలికి వెళ్ళాడు.

"నేను దొంగతనం చెయ్యటమేమిటి? ఇలా దొంగలాగా బయటికి వెళ్లటం చూస్తే నా నౌకర్లు ఏమనుకుంటారు?" అనుకున్నాడాయన. కాని అదృష్టవశాత్తూ ఎవరికంటా పడకుండానే ఆయన అశ్వశాలను చేరుకుని తన గుర్రంమీద ఎక్కి, అరణ్యం కేసి బయలుదేరాడు. దొంగలాగే ఆయన తన ముఖం కిందిభాగాన్ని, నెత్తిని గుడ్డతో కప్పుకున్నాడు.

ఆలోచించినకొద్దీ ఆయనకు దొంగలమీద గౌరవం హెచ్చింది. దొంగతనం చెయ్యటానికి ఎంత నేర్పు కావాలి! ఎంత గుండెధైర్యం



కావాలి! పట్టుబడితే జనం చంపేస్తారు; ఒకవేళ జనం చంపకపోతే రాజు ఉరితీయిస్తాడు. తాను రాజే అయినాకూడా దొంగతనం చెయ్యటంలో తనకూ ప్రమాదం ఉన్నది: దొంగతనం చేస్తూ దొరికిపోతే, తాను ఫలానా అని తెలిసేలోపుగా అవతలివాళ్ళు చంపెయ్యవచ్చు; ఒకవేళ, వాళ్ళు చంపేలోపుగా తాను రాజునని రుజువు చేసుకోగలిగినా బతికిఉన్నంత కాలమూ తీరని అవమానం!

"నేను ఒంటరిగా దొంగతనం చెయ్యలేను. నాకెవరైనా దొంగ ఒకడు జతపడితే బాగుండును!" అనుకున్నాడు మహారాజు.



కాని ఆయనకు దారిలో ఎవరూ ఎదురు తగలలేదు. కాని అరణ్యం ప్రవేశించిన కొద్ది సేపటికి, ఒక నల్లగుర్రం ఎక్కి, ముఖం గుర్తించటానికి లేకుండా కప్పుకుని ఒక వ్యక్తి ఎదురయాడు.

"ఇంత రాత్రివేళ ఎక్కడికి పోతున్నావు? నీ పని ఏమిటి? పేరేమిటి?" అని రాజు ప్రశ్నించాడు. కాని రెండవ మనిషి సమాధానం ఇవ్వలేదు. రాజు వాడిమీదికి కలియబడి, "చాతనైతే ఆత్మరక్షణ చేసుకో!" అన్నాడు. ఇద్దరూ గుర్రాలపైననే ఉండి కొంతసేపు యుద్ధంచేశారు, తరవాత నేల మీద దిగి యుద్ధంచేశారు. చివరకు రాజుగారే గెలిచాడు. రెండోవాడు పడిపోయి రాజుకు చిక్కి, "నీ కంటె మంచి యోధుణ్ణి నేనెన్నడూ ఎదుర్కోలేదు. కావాలంటే నన్ను చంపెయ్యి, నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

"నీ ప్రాణాలు తీస్తే నాకేంలాభం? నీవు మంచి యోధుడివే, నీ స్నేహం నాకు లాభించవచ్చు. నీ పేరేమిటి?" అని మహారాజు అడిగాడు.

"నా పేరు సహదేవుడు," అన్నాడు ఓడిపోయినవాడు.

"ఓహో, నీవు దొంగవేనా? బాగా దొరికావు. ఇద్దరమూ ఎటైనా పోయి దొంగతనం





చేద్దాం పద. రాజుగారి ఇంటికి కన్నం వేద్దామంటావా?" అని రాజు అడిగాడు.

"వద్దు, మహారాజుకు నేనెన్నడూ ఎలాటి ద్రోహమూ చేయలేదు. కావలిస్తే శూరసేనుడి ఇంటిని దోచుకుందాం," అన్నాడు సహదేవుడు. శూరసేనుడు ఉగ్రసేనుడి సామంతులలో ముఖ్యుడు. మహారాజు చెల్లెలిని పెళ్ళాడి దగ్గిరబంధువుకూడా అయాడు.

"రాజుమీద ఎంతో భక్తి ఉన్నట్టు కనిపిస్తావే, ఆయన చెల్లెలి భర్తను ఎలాదోస్తావు? ఇదేనా నీ రాజభక్తి?" అని రాజు అడిగాడు.

"నా రాజభక్తి శూరసేనుడి రాజభక్తి కన్నా ఎక్కువే. అవసరమైతే ప్రాణం ఒడ్డి రుజువుచేస్తాను. పాపం, రాజుగారి చెల్లెలు ఆ భర్తతో ఏమీ సుఖపడటంలేదని విన్నాను," అన్నాడు సహదేవుడు.

ఈ మాటలకు రాజు ఆశ్చర్యపడ్డాడు; శూరసేనుడు తన కుడిభుజంలాటివాడనీ, అతనికి భార్యమీద ఎంతో అభిమానమనీ ఆయన అనుకుంటూ వచ్చాడు. కాని సహదేవుడు చెప్పేది మరొకవిధంగా ఉన్నది.

"సరే, అక్కడే దొంగతనం చేద్దాం పద!" అన్నాడు రాజు.

ఇద్దరూ గుర్రాలెక్కి శూరసేనుడి కోటను చేరుకున్నారు. సహదేవుడు ఆరితేరిన దొంగ కావటంచేత పహరావాళ్ళ కళ్ళుకప్పి రాజును





తన వెంటబెట్టుకుని కోటను ప్రవేశించాడు. వాడి సమర్థతకు రాజు ఆశ్చర్యపడి, "వీడు వెంట ఉండకపోతే నేనీపాటికి పహరా వాళ్లకు చిక్కి ఉందును!" అనుకున్నాడు.

సహదేవుడు పైకి అనలేదుగాని, తన అనుచరుడికి దొంగతనంలో అనుభవం అంతగా లేదని తెలుసుకున్నాడు. అతను మహారాజును ఒక చీకటి స్థలంలో చేర్చి, "నేను వెళ్లి క్షణంలో ధనం తెస్తాను. నేను వచ్చినదాకా ఇక్కడే ఉండు; కదలకు!" అని చెప్పి వెళ్ళిపోయాడు.

కొద్దిసేపటికల్లా వాడు బరువైన మూటలతో ధనమూ, నగలూ అవీ మోసుకు వచ్చాడు. రాజుకు వాణ్ణి చూస్తే అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. "మనం ఈ బరువును గుర్రాలమీద వేసుకుని త్వరగా వెళ్లకపోతే చిక్కిపోగలం!" అన్నాడాయన.

"తొందరపడకు. ఇంకొక్క దొంగతనం ఉన్నది. మేడమీది పడకగదిలో శూరసేనుడి బంగారు మువ్వల జీను ఉంటుంది. దాన్ని అపహరించకుండా వెళ్ళటం నాకు అవమానకరం. ఇప్పుడే వస్తాను," అంటూ సహదేవుడు మళ్లీ మాయమయాడు.

అతను కొంచెంకూడా చప్పుడు చేయకుండా పై అంతస్తు చేరుకుని శూరసేనుడి పడకగది ప్రవేశించాడు. మంచంమీద శూరసేనుడూ, భార్యా నిద్రపోతున్నారు. సహదేవుడు బంగారుమువ్వల జీను ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని, దాన్ని తీసుకుని ఎత్తుతూండగా మువ్వలు చప్పుడయాయి. ఆ కాస్త చప్పుడుకే శూరసేనుడు దిగాలున లేచి కూచుని, "ఎవరక్కడ? ఏదీ కత్తి?" అని కేకలుపెట్టాడు.

ఈ కేకలకు భార్య నిద్ర మేలుకుని, "ఏమిటది? ఎందుకు కేకలు పెడుతున్నారు?" అన్నది.

"గదిలోకి ఎవడో చేరాడు. ఏదో చప్పుడయింది!" అన్నాడు శూరసేనుడు.



"గాలికి చెట్ల కొమ్మలు కదిలి ఉంటాయి. కాకపోయినా ప్రతిరాత్రీ మీరేదో పీడ కలలు కనటమూ, ఉలికిపడి లేవట మూనూ! మీ మనసులో ఏదో రగులుతూ బాధపెడుతున్నది. అదేమిటో నాక్కూడా కాస్త చెప్పకూడదా? ఒంటరిగా ఎంతకాలం భరిస్తారు ఆ బాధ?" అన్నది భార్య.

శూరసేనుడు వికటంగా నవ్వి, "నీ కెందుకు దిగులు? రేపటితో నా బాధలన్నీ అంతమవుతాయిలే. రేపు సాయంకాలం లోపల అర్ధ రాజ్యం నాదైపోతుంది!" అన్నాడు.

"రేపు మహారాజు కొలువుకు వెళుతున్నా నన్నారుగాని, ఈ అర్ధరాజ్యం ఇస్తున్నారని చెప్పారుకారే?" అన్నది మహారాజు చెల్లెలు ఆశ్చర్యపోతూ.

"ఒకరిచ్చేదేమిటి? మేమే పుచ్చు కుంటాం. నేనూ నా మిత్రులు కొందరూ కలిసి రేపు కొలువులో మహారాజును హత్య చేసి రాజ్యం పంచుకుంటాం!" అంటూ దుష్టుడైన శూరసేనుడు తన భార్యకు కుట్రలో పాల్గొంటున్న సామంతులందరి పేర్లూ చెప్పాడు.

"నా బొందెలో ఊపిరి ఉండగా మా అన్నను హత్యచేయనివ్వను," అంటూ శూర సేనుడి భార్య లేవబోయింది. శూరసేను డామెను స్పృహ తప్పిపోయినదాకా కొట్టాడు. ఆయన మళ్ళీ పడుకోగానే సహ దేవుడు వచ్చిన దారినే కిందికి దిగివెళ్ళి, తన తోటి దొంగతో తాను చూసినదీ, విన్నదీ పూసగుచ్చినట్టు చెప్పేసి, "నా కత్తి నా కిచ్చెయ్యి, ఆ రాజద్రోహిని ఇప్పుడే చంపి వస్తాను. ఒకవేళ నేను తిరిగి రాకపోతే చచ్చిపోయాననుకుని నీ దారిన నువు వెళ్ళిపో!" అన్నాడు.

శూరసేనుడు రాజద్రోహం కోసం కుట్ర పన్నటమే గాక కొంతమంది సామంతులను అప్పుడే కూడగట్టాడనికూడా విని రాజు తన



చెవులను తానే నమ్మలేకపోయాడు. కాని సహదేవుడు అబద్ధమాడవలసిన పనే మున్నదీ? అందుచేత ఈ వార్త నిజమేనని రాజు నమ్మవలసివచ్చింది.

ఆయన సహదేవుడితో, "నీకేమైనా మతి పోయిందా ఏమిటి? రాజుకోసం నీ ప్రాణాలు బలిచేస్తానంటున్నావు, ఆ రాజు నీకేం ఒరగ బెట్టాడు?" అన్నాడు.

"నువు నా ప్రాణాన్ని దానంచేశావు గనక సరిపోయిందిగాని, ఈ మాట అన్నందుకు చంపేసి ఉందును. రాజు సత్పురుషుడు. ఆయునకు కీడు రావటానికి వీల్లేదు. నా కత్తి ఇచ్చెయ్యి," అన్నాడు సహదేవుడు.

"వద్దు, మనం వెళ్ళి ఈ వార్త రాజుకే చెబుదాం. రాజద్రోహుల సంగతి ఆయనే చూసుకుంటాడు," అన్నాడు రాజు.

"తన మిత్రుడూ, బావమరిదీ అయిన శూరసేనుడిమీద నేను ఆరోపణలు చేస్తే రాజు వింటాడా? నేను దొంగను, దేశబహిష్కార శిక్ష పొందినవాణ్ణి. నన్ను చూస్తూనే రాజుగారు ఉరితీయిస్తాడుగాని, కుట్రలను గురించి నేను చెప్పేదంతా వింటూకూచోడు," అన్నాడు సహదేవుడు.

"నేను దేశ బహిష్కారం పొందినవాణ్ణి కాను. నేనే వెళ్లి ఆయనను హెచ్చరిస్తాను," అన్నాడు రాజు. తరవాత దొంగ లిద్దరూ



అరణ్యంలో ఒకచోట కలుసుకునేటందుకు కూడా సంకేతం ఏర్పరచుకున్నారు.

తెల్లవారకముందే, ఎవరికంటా పడకుండా రాజు తన భవనానికి తిరిగి వచ్చాడు. కుట్రలో చేరిన సామంతుల పేర్లు ఆయనకు తెలుసు గనక, వారిని మినహాయించి మిగిలిన సామంతులను అప్పటికప్పుడే పిలిపించి వారితో తనకు వచ్చిన కల గురించీ, తాను సహదేవుణ్ణి కలుసుకోవటం గురించీ, శూరసేనుడి కుట్ర విషయం గురించీ అంతా చెప్పాడు. సామంతులు శూరసేనుడితోనూ ఇతర కుట్రదార్లతోనూ ప్రాణాలకు తెగించి పోరాడతామని శపథాలు చేశారు.

"గోరుతో పోయేదానికి గొడ్డలి దేనికి? కుట్రదారులు మనమీదికి దండెత్తి రారుకదా! ఒకరొకరే వస్తారు; ఒక్కొక్కరి ఆయుధాలే లాగేసుకుంటే సరిపోతుంది," అన్నాడు ఉగ్రసేన మహారాజు.

అలాగే జరిగిందికూడా. కుట్రదారులందరూ వెంట ఆయుధాలు దాచుకుని వచ్చి, నలుగురూ చుట్టుముట్టేసరికి వాటిని బయటికి తీసి ఇచ్చేశారు. ఆఖరుకు వచ్చినవాడు శూరసేనుడు. అతన్ని పట్టుకుని రాజు వద్ద ఉంచారు. తన అనుచరులు తనకన్న ముందే బందీలుగా చిక్కిపోయారని గ్రహించి అతను, "ప్రభూ, ఏమిటీదౌర్జన్యం?



మీ బావమరిదీ, మీ సామంతుననూ అయిన నాకు ఇలాగేనా స్వాగతమిచ్చేది?" అన్నాడు.

"కాదు, ఇది రాజద్రోహులకిచ్చే స్వాగతం," అన్నాడు రాజు.

"ఎవడా మాట అన్నది? వాణ్ణి పిలిపించండి, నా కత్తితో వాడికి సమాధానం చెబుతాను," అన్నాడు శూరసేనుడు.

రాజు తన మనిషిని అరణ్యంలోని సంకేతస్థలానికి పంపాడు. వాడు అక్కడికి చేరి సహదేవుణ్ణి చూసి, "రాజుగారు మిమ్మల్ని రమ్మంటున్నారు!" అన్నాడు. తన అనుచరుడు రాజుగారికి దొరికిపోయి ఉంటాడనీ, తననికూడా పట్టుకునేటందుకు ఎత్తు వేశాడనీ సహదేవుడు సంకోచించాడు. కాని రాజు అంత నీచానికి ఒడిగట్టడనుకుని, రాజు మనిషివెంట రాజభవనానికి వచ్చాడు.

అతను రాజుతో, "మహారాజా, నేను దొంగను. దేశబహిష్కారం పొందినవాణ్ణి. అయినా తమ ఆజ్ఞననుసరించి, మీ మంచితనంలో విశ్వాసం ఉంచి వచ్చాను," అన్నాడు. "పిచ్చివాడా, నిన్నరాత్రి చంపకుండా విడిచిపెట్టినవాణ్ణి, ఇవాళ చంపిస్తానా?" అన్నాడు రాజు.

"నిన్నరాత్రి అడవిలో కనబడింది మీరా?" అన్నాడు సహదేవుడు ఆశ్చర్యంతో.

"అవును, నిన్న నాకు దొంగతనం నేర్పావు. ఈపూట ఇంకొక సహాయం నీవల్ల కావాలి. ఈ రాజద్రోహితో ద్వంద్వయుద్ధం చేస్తావా?" అని రాజు అడిగాడు.

సహదేవుడు సంతోషంగా సమ్మతించి శూరసేనుడితో కత్తియుద్ధం సాగించాడు. చాలాసేపు ఇద్దరూ సమ ఉజ్జీలుగా పోరాడిన తరవాత అదృష్టవశాత్తూ శూరసేనుడు సహదేవుడి చేతిలో ప్రాణాలు వదిలాడు.

సహదేవుడిపైన ఉన్న అంకలన్నీ ఉపసంహరించి ఉగ్రసేన మహారాజు అతనికి శూరసేనుడి జాగీరిచ్చి తన సామంతులలో ఒకడుగా చేసుకున్నాడు.



# గలివర్ యాత్రలు

నా పేరు లెమ్యూల్ గలివర్. అది 1700 సంవత్సరం. నేను "ఏంటిలోప్" అనే బ్రిటిష్ వాణిజ్య నౌకలో ప్రయాణం చేస్తున్నాను.



దారిలో పెద్ద గాలి తుఫానూ వచ్చింది. ఆ హడావుడిలో మా ఓడ నీళ్ళ మధ్యనున్న రాతికి కొట్టుకుని బద్దలైపోయింది.



నేను ఇంకొక అయిదుగురితో కలిసి ఓ పడవలో దూకాను. శక్తినంతా వుపయోగించి తెడ్లేసి ఆ రాళ్ళకి దూరంగా పడవ నడిపాము.



మా ఓడ చాలా వేగంగా మునిగిపోయింది.
చాలామంది మునిగిపోయారుకూడా.




అరగంట తరవాత సుమారు మూడు మైళ్ల
దూరంలో తీరం కనబడింది.



మేమందరం బాగా అలిసిపోయాం. పెద్ద కెరటం
వచ్చి మా పడవని తల్లకిందులు చేసింది.



నా తోటివారు మునిగిపోయారు. అదృష్టవశాత్తూ
నేను ముక్కాలి గంట ఈదుకుంటున్నాను.



కొంతసేపు తరువాత కాళ్లకి నేల తగిలింది.
ఒక మైలు నీళ్లలో నడిచి ఒడ్డు చేరుకున్నాను.



ఒడ్డు దాటి ఓ అరమైలు నడిచానుగాని మనుష్య
సంచారం ఏమీ కనబడలేదు.



బాగా అలసిపోయి వున్నానేమో కళ్లుమూసుకు పోసాగాయి. అక్కడే గడ్డి మీద నడ్డివాల్చాను.



కళ్ళు తెరిచేప్పటికి బాగా తెల్లవారింది. లేద్దామని ప్రయత్నిస్తే కదల్లేకపోయాను.



చుట్టూరా సన్నటి గొంతుకలు మెల్లిగా వినిపిస్తున్నాయి. కళ్లు అటూ ఇటూ తిప్పిచూద్దునుగదా, చేతులూ కాళ్ళూ సన్నటి తాళ్ళతో కట్టేసివున్నాయి. పొడుగాటి నా జుట్టుకూడా అలాగే కట్టేసివున్నది.



అరంగుళాల ఎత్తున్న మనిషి కత్తితో నా ముఖంవైపు వస్తున్నాడు.




అతని వెనకాల అలాటివాళ్ళు మరికొందరు రావటం కనిపించింది. నేను గట్టిగా అరిచాను.



వెంటనే తాళ్లు తెంపుకునే ఉద్దేశంతో అటూ ఇటూ గింజుకున్నాను. ఎడం చేతిని వున్న తాళ్లు చాలామటుకు ఫట్ మని తెగాయి. ఎడంవైపు జుట్టుని కట్టేసిన తాళ్లుకూడా కొన్ని వదులయ్యాయి.



"టోల్గో ఫోనాక్" అనేకేకలు వినబడ్డాయి. చిన్న చిన్న బాణాలు మొహానికి గుచ్చుకున్నాయి.



అడుగున్నర ఎత్తు మంచెమీద ఒకాయన ఎక్కి ఉపన్యాసం ఇచ్చాడు.



నాకు ఆకలి వేస్తోందని అతడికి సంజ్ఞలు చేశాను. నా ఉద్దేశం అతడికి అర్థమయి వుంటుంది.



బోలెడుమంది బుల్లి బుల్లి మనుషులు ఆహార పానీయాలతో నా దేహం మీదకు ఎక్కసాగారు



ఏడువందల ఏళ్ళక్రితం వెనిస్ నగరంలో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. పెద్దవాడు నికోలో పోలో, చిన్నవాడు మఫియో పోలో. వారు వర్తకం చేస్తూ అనేక దేశాలు తిరిగారు. వారు 1260 లో వర్తకంమీద కాన్‌స్టాంటినోపుల్ దాకా వెళ్ళి, అక్కడినుంచి తలవని తలంపుగా ఏడాడిపాటు ప్రయాణం చేసి ఎక్కడో చీనాదేశంలో ఉన్న తాతార్ చక్రవర్తి కుబిలాయ్ ఖాన్ వద్దకు వెళ్ళటం తటస్థించింది. ఆ కాలంలో యూరపు దేశం నుంచి ప్రాచ్య దేశాలకు ఆ విధంగా వెళ్ళిన వారెవరూ లేరు.

తాతార్లు మంగోలియా దేశానికి చెందిన ఒక తెగ. వారు అనాగరికులు. 1206 లో వారు తమ పుణ్యక్షేత్రమైన కారకోరం మైదానంలో సమావేశమై తమ నాయకుడుగా ఛింఘిజ్ ఖాన్ అనే వాణ్ణి ఎన్నుకున్నారు. ఛింఘిజ్ ఖాన్ పరిపాలన ప్రారంభమైన పన్నెండేళ్ళ లోపల వారు చీనా ఉత్తర ప్రాంతంలోని స్వతంత్ర దేశమైన కాతేను జయించి ఆక్రమించుకున్నారు. ఆ తరవాత వారు ప్రపంచమంతటినీ జయించటానికి తీర్మానించుకుని, ఇండోచీనా, ఇండియా, అరేబియా, పశ్చిమ యూరపు తప్ప మిగతా యూరపు ఆసియా ఖండాలను జయించేశారు. ఏ రాజ్యమూ లేకుండా దిగ్విజయానికి పూనుకున్న తాతార్లు రెండు తరాల కాలంలో, అదివరకు గాని ఆ తరవాతగాని ఎవరూ పరిపాలించనంత విస్తృతమైన సామ్రాజ్యాన్ని ఏర్పరచుకున్నారు. ఛింఘిజ్ ఖాన్ వారసులకు "పెద్ద ఖాను" అన్న బిరుదు సంక్రమించింది. కాతే అయన కింద ఉండేది. మిగిలిన సామ్రాజ్యమంతా ముగ్గురు చిన్న ఖానుల పరిపాలనకింద



పంచారు. వారు పెద్దఖానుకు లోబడి పాలన సాగించారు.

కాతేను పరిపాలించిన పెద్ద ఖానులలో కుబిలాయ్ అయిదోవాడు, ఆయన ఛింఘిజ్ ఖాన్‌కు మనవడు. ఆయన పోలో సోదరులను గొప్పగా ఆదరించి, వారి ద్వారా ప్రపంచ రాజ్యాలను గురించి అనేక విషయాలు తెలుసుకుని, వారిని రోమునగరంలో ఉండే పోప్ వద్దకు తన దూతలుగా వెళ్లమని కోరాడు.

పోలో సోదరులు ఇందుకు సమ్మతించి ప్రయాణమై వచ్చేసరికి పోప్ చనిపోయాడనీ, కొత్త పోప్ ఎన్నిక ఇంకా జరగలేదనీ తెలిసింది. అందుచేత వారు వెనిస్‌నగరానికి తిరిగి వెళ్లి, అక్కడ కొద్దికాలం ఉండి, పెద్ద ఖాను కనిపెట్టుకుని ఉంటాడన్న భయంతో మళ్లీ కాతేకు ప్రయాణమయారు.

ఈ ప్రయాణంలోనే వారివెంట మార్కో పోలో బయలుదేరాడు. పోలో సోదరులలో పెద్దవాడైన నికొలోకు మార్కో కుమారుడు. ఈ మార్కో పోలోయే తన తండ్రులవెంట కాతేకు వెళ్లి, అక్కడ పదిహేడేళ్లపాటు పెద్దఖాను కింద కొలువు చేసి అనంతరం స్వస్థలానికి వచ్చి తన ప్రపంచ పర్యటన అనుభవాలు రాసుకున్నాడు.

* * *

జార్జియాను పరిపాలించే రాజులందరికీ డేవిడ్ మాలిక్ (డేవిడ్ రాజు) అని పేరుండేది. ఈ రాజు తాతార్ల సామంతు. జార్జియా ప్రజలు అందమైనవాళ్ళు, మంచి యోధులు. అలెగ్జాండరు పడమటి దేశాలపైకి దండెత్తిపోతూ జార్జియాగుండా వెళ్ళలేకపోయాడు. ఎందుచేతనంటే అతను వెళ్ళవలిసిన దారి ఇరుకైనది; ఒక పక్క సముద్రం ఉన్నది, రెండవపక్క ఎత్తయిన కొండలూ, అశ్వారోహకులు ప్రవేశించటానికి సాధ్యంగాని అరణ్యాలూ ఉన్నాయి. కొండలకూ సముద్రానికీ మధ్య 14 మైళ్ళ పొడ



వున ఉన్న ఈ ఇరుకుదారిన ఎంతమంది వచ్చినా కొద్దిమంది సైనికులు ఆటంకపరచ వచ్చు. అందుకే అలెగ్జాండరు ఆ దారిన వెళ్ళలేకపోయాడు. జార్జియావారు తనపైన వచ్చి పడకుండా అలెగ్జాండరు ఇక్కడ ఒక బురుజూ, కోటా నిర్మించాడు. దాన్ని ఇనప ద్వారం అనేవారు.

జార్జియాకు ఉత్తరంగా నల్లసముద్రమూ, తూర్పుగా బకూసముద్రమూ, ఉన్నాయి. ఈ బకూ (కాస్పియన్) సముద్రం నిజంగా సముద్రం కాదు, ఒక బ్రహ్మాండమైన సరస్సు; దాని చుట్టుకొలత 2,800 మైళ్ళు. దీనిలో జనం నివసించే లంకలూ, అందమైన నగరాలూ ఎన్నో ఉన్నాయి.



బాగ్దాదులో ముత్యాలకు రంధ్రాలు వేసే నిపుణులుండేవారు. ఇండియానుంచి ముత్యాలు ఇక్కడికి వచ్చి ఇక్కడినుంచి క్రైస్తవ దేశాలకు ఎగుమతి అయేవి. ఇక్కడ బంగారు పోగులతోనూ, వెండి పోగులతోనూ వస్త్రాలు నేసేవారు. ఆ ప్రాంతాల అంత గొప్ప నగరం మరొకటి లేదు. అక్కడ ముస్లిము మతధర్మాలే గాక, ఇంద్రజాల విద్యా, ఇతర శాస్త్రాలూ నేర్చుకునేవారికి సౌకర్యాలుండేవి.

ప్రపంచంలో ఏ వ్యక్తివద్దా లేనంత సంపద ఖలీఫావద్ద ఉండేది. 1258 లో ఒక సంఘటన జరిగింది. హులగుఖాన్ అనే వాడు గొప్ప తాతారు సైన్యంతో బాగ్దాదు పైకి దండెత్తి వచ్చాడు. ఇతను మొంగుఖాన్ తమ్ముడు. వారు నలుగురు అన్నదమ్ములు. వారు కాథేను జయించినాక ప్రపంచాన్నంతా జయించ బూనుకుని, నాలుగు దిశలూ నలుగురూ పంచుకున్నారు. దక్షిణదిశ హులగు వంతుకు వచ్చింది. ఆయన దిగ్విజయం చేసుకుంటూ బాగ్దాదు దాకా వచ్చాడు. బాగ్దాదు బలంతో వశం కావటం దుర్ఘటమని ఆయన దానిని యుక్తితో జయించ నిశ్చయించాడు. ఆయన వెంట కాల్బలం కాక, ఇరవైవేల ఆశ్విక





సైనికులున్నారు; అయినా ఆయన తనవెంట చాలా స్వల్ప బలాలున్నట్టు ఖలీఫాకు తోచేలాగ చేశాడు. బాగ్దాదు చేరబోయేముందు ఆయన తన సైనికులలో హెచ్చుమందిని దారికి అటూఇటూ గల చెట్ల తోపులలో దాచాడు, మిగిలిన సైన్యంతో ఆయన బాగ్దాదు ద్వారంపై దాడిచేశాడు.

ఖాన్ వెంట ఉన్న సైన్యం చాలా కొద్దిపాటిదని ఖలీఫా అలక్ష్యంగా తన బలాలతో శత్రువును ఎదుర్కొవచ్చాడు. ఇది చూచి హులగు పారిపోతున్నట్టు అభినయించాడు. ఖలీఫా బలాలు మోసపోయి శత్రువును వెంబడించి, మాటులో చిక్కుకుపోయాయి. వారిని హులగుఖాన్ బలాలు చుట్టుముట్టి నిర్మూలించేశాయి. బాగ్దాదు నగరంతోబాటు ఖలీఫాకూడా తాతార్ల వశమయాడు.

తరవాత హులగు ఒక బురుజునిండా బంగారం దాచిఉండటం చూసి నిర్ఘాంతపోయాడు. బంది అయిన ఖలీఫాను తన వద్దకు రప్పించి, "ఖలీఫా, ఈ బంగారమంతా ఇలా ఎందుకు పేర్చి పెట్టావు? దీనితో ఏంచేద్దా మనుకున్నావు? నిన్ను దోచుకోవటానికి నేను సైన్యాలతో వస్తున్నానని ఎరగవా? దీనినంతా నీ సైనికులకూ, యోధులకూ పంచిపెట్టి నగర రక్షణ చేయమని ఎందుకు కోరలేదు?" అని అడిగాడు.

దీనికేమనాలో తెలియక ఖలీఫా ఉలకక పలకక ఊరుకున్నాడు.

"నీకు ధనమంటే అంత ప్రీతి గనక నీ ధనం నీవే భోజనం చెయ్యి!" అంటూ హులగు, ఖలీఫాను బురుజులో బంధించమనీ, తినేటందుకేమీ ఇవ్వవద్దనీ ఉత్తరువు చేశాడు. నాలుగు రోజులపాటు ఆ బురుజులోనే ఉండి అనంతరం ఖలీఫా మరణించాడు. ఆ తరవాత ఖలీఫాలు మరి లేరు.

—(ఇంకా వుంది)





# గంగావతరణము

తృతీయాశ్వాసము :

అని పలికిన మునికి మ్రొక్కి
అంశుమంతు డిట్లనియెను :
" ఓ మహాత్మ సెలవీయుము
తామెఱుగని దేదిలేదు.

స్వామీ ! మా తండ్రులకిక
శాంతియెట్లు లభియించును ?
దుర్గతులగు మావారికి
స్వర్గమెట్లు లభియించును ?

ఒక ఉపాయ మేదైనను
ఊహచేసి ఆనతిమ్ము "
అనియడిగిన కపిలర్షియు
ఆలోచన చేసి పలికె :

" ఒక ఉపాయమున్నదోయి
ఒనరింపగలేరు మీరు
ఇట గంగను పారించిన
ఎల్లరకును శాంతికలుగు. "

" గంగ ఎవ్వ "రనె నాతడు
కపిలర్షియు చెప్పెనిట్లు :
" గంగానది విష్ణుమూర్తి
కాలినుండి జన్మించెను.

బ్రహ్మ తన కమండలమున
పట్టియుంచుకొనె దానిని
ఆ గంగను ఇటుతెచ్చిన
అందఱకును శాంతికలుగు. "

అని కపిలుడు చెప్పినంత
అంశుమంతు డాత్రముపడి
" ఏ విధమున గంగ నిటకు
తేవలయునొ తెల్పు "డనెను.

" గంగ నిటకు గొనితెచ్చుట
కష్టమ్మది ఓ కుమార !
బహుతపమ్ము చేయవలయు
బ్రహ్మను మెప్పించవలయు.

ఉత్పల సత్యనారాయణాచార్య



దివి నుండిన గంగానది
భువి మీదికి ఏతెంచిన
భూలోకము స్వర్గమగును
పుణ్యమగును మీవారికి."

అని చెప్పిన కపిలర్షికి
అతడపుడు మ్రొక్కినాడు
దీవనలిడి సెలవిమ్మని
దివ్యర్షిని అడిగినాడు.

ఆ మహర్షి దీవనలిడి
హయమునిచ్చి పంపించెను
గంగ నిటకు తేవలెనను
కాంక్షతోడ అతడేగెను.

చతుర్థాశ్వాసము:

సగరరాజు యజ్ఞమెల్ల
సంపూర్ణమ్మయి పోయెను
అంశుమంతు రాజు జేసి
అత డడవుల బడి పోయెను.

అంత కొంత కాలమునకు
అంశుమంతు డడవి కేగి
బ్రహ్మను మెప్పించ దలచి
బహుతపమ్ము గావించెను.

ఎంతయొ తప మతడు చేసె
ఏండ్లు పూండ్లు గడచి పోయె
బ్రహ్మదేవు డప్పటికిని
ప్రత్యక్షము కాకపోయె.

అంశుమంతునికి పిమ్మట
అతని పుత్రుడగు దిలీప
రాజు కూడ తపము చేసి
లాభమ్మును పొందడాయె.

ఆ దిలీపరాజు కొడుకు
అతనిపేరు భగీరథుడు
పట్టుదలను విడువనట్టి
దిట్టతనముగల యోధుడు.

తన పూర్వులు ముక్తి గొంద
తన తాతల కోర్కె దీర
గంగ నిటకు తేవలెనని
గట్టి పట్టు పూనె నతడు.



తన కొడుకును రాజు చేసి
వనమునకును పోయినాడు
బిందుసరోవరము చెంత
పెద్ద తపము పూనినాడు.

జడలు కట్టె సిగ యంతయు
వడలిపోయె ఒళ్ళంతయు
రోజురోజు కతడు దివ్య
తేజముతో మెఱసిపోయె!

అన్నపానములను వదలె
కన్నుగవను విప్పడాయె
దినదినమున కతడు దివ్య
తేజముతో మెఱసిపోయె!

మండుటెండలోన తపమె
మంచులోన తపమె తపమె!
జడివానలలోన తపమె
చలిగాడ్పుల తపమె తపమె!

తప మాతని రూపు దాల్చె
తపము రూప మత డయ్యెను
ఎపుడు తపమె ఎపుడు తపమె
తపము! తపము! తపము! తపము!

ఆతని తపమునకు స్వర్గము
ట్టుడికినయు ట్టుడికెను
తలకు భయ మయ్యెను
ంద్రుడు అదిరిపడెను!

పావనమగు గంగానది
పంపించము భువి మీదికి
మావారిది గంగానది
మానవులకు దుర్లభ మది.

అని తలంచి దేవేంద్రుడు
తనదు సభకు రమ్మటంచు
ఊర్వశియను అప్సరసకు
ఉత్తరువును పంపించెను.

అందాలకు నెలవైనది
అప్సరసలలో చిన్నది
ఒయ్యారపు నడకలతో
ఊర్వశి అరుదెంచినయది.





దేవేంద్రుని కామె మ్రొక్కి
"దేవపతీ! ఏమి ఆజ్ఞ
సెలవి"మ్మని అడిగినంత
చెప్పె నిట్లు దేవేంద్రుడు :

"బిందుసరసు చెంత నొకడు
పెద్ద తపము పూనినాడు
పలవుల గొలిపించి నీవు
వాని తపము చెఱపి రమ్ము."

'చిత్త'మంచు నామె మరల
చేతులు జోడించి మ్రొక్కి
ఆ క్షణమున అచ్చోటికి
హంసవోలె ఎగిరిపోయె.

బిందుసరమునం దెల్లెడ
అందమ్ములు ఇనుమడించె
వన మెల్లను విరియ జూచి
కనులపండు గయ్యె నపుడు!

తీవ తీవ పూలు పూచె
పూవు పూవు పాళ్ళు రాల్చె
కొమ్మకొమ్మ కోయిలమ్మ
కోకోయని కూయసాగె!

అపు డూర్వశి ఏతెంచెను
తపసి రూపు పరికించెను
గజ్జెలు ఘలుఘల్లనంగ
కాలు కదిపి నర్తించెను.

భగీరథుడు కనులు మోడ్చి
బ్రహ్మను ధ్యానించుచుండె
అతని యెదుట నామె సొగసు
అడవి గాయు వెన్నె లాయె!

ఆట నాపి ఊర్వశి యొక
పాట బాడ సాగించెను
చెవిటికి సం కూదినట్లు
చివర కదియు వ్యర్థమాయె!

ఆడి యాడి అలసి సొలసి
పాడి పాడి ఆ యూర్వశి
కొప్పులోని దండ తీసి
కోపముతో విసరివైచె. —(సశేషం)



# 5. గోల్ గుంబజ్

బొంబాయికి సుమారు 300 మైళ్ల దూరాన ఆగ్నేయ దిశగా ఉన్న బీజాపూరు 16వ శతాబ్దంలో ముస్లిము రాజులకు రాజధానిగా ఉండేది. బీజాపూరును స్వతంత్రరాజ్యంగా వ్యవస్థాపించినవాడు యూసుఫ్ ఆదిల్‌షా అనే సుల్తాను.

అక్కడ ఉన్న కట్టడాలలో జగద్విఖ్యాతి సంపాదించుకున్న కట్టడం గోల్ గుంబజ్. ఇది సుల్తాను మహమ్మద్ ఆదిల్‌షాయొక్క సమాధి. దీని నిర్మాణం 1626 లో ప్రారంభమై, ముప్పైఏళ్ల అనంతరం 1656లో పూర్తి అయింది.

ఇది నలచదరమైన కట్టడం. ఏవైపు చూసినా 600 అడుగులు నిడివి గల దిమ్మపై ఈ కట్టడం కట్టబడింది. ఈ దిమ్మ నాలుగు కోణాలలోనూ నాలుగు బురుజులు కట్టిఉన్నాయి; అవి ఏడేసి అంతస్తులు గలవి.

కట్టడం లోపలిభాగంలో విశాలమైన నలచదరపు హాలున్నది. ఇది 135 అడుగుల పొడుగూ, 135 అడుగుల వెడల్పూ ఉన్నది. ఈ హాలుకు ఎగువగా ఒక పెద్ద గుమ్మటం (డోము) ఉన్నది. ప్రపంచంలో ఎక్కడా ఇంత పెద్దగుమ్మటం లేదని చెబుతారు. ఈ గుమ్మటం వ్యాసం 124 అడుగులు. ఇది హాలుకు 178 అడుగుల ఎత్తున ఉన్నది. బయటినుంచి చూసినట్టయితే ఈ గుమ్మటం ఎత్తు 198 అడుగులు.

బీజాపూర్‌లో ఇంకా అనేకమైన ప్రఖ్యాత శిథిలాలున్నాయి.





# గుణహారం

ఎనిమిదివందల ఏళ్లక్రితం చీనాలోని హంగ్‌చౌ మహానగరం సూంగ్ సామ్రాజ్యానికి రాజధాని. అది సకల సంపదలతోనూ తులతూగుతున్నప్పటికీ అక్కడ అంతులేని బిచ్చగాళ్లు ఉండేవారు. ఈ బిచ్చగాళ్లకు ఒకడు రాజుగా ఉండేవాడు. బిచ్చగాళ్లు రోజూ సంపాదించేదానిలో అతను ఒక వంతు తీసుకుంటూ ఉండేవాడు, ఆ డబ్బు వడ్డీల కిచ్చి వ్యాపారం చేస్తూండేవాడు. ఈ విధంగా బిచ్చగాళ్లకు రాజయినవాడు ఎంతో సంపన్నుడు కావటానికి అవకాశం ఉండేది. అనేక తరాలుగా బిచ్చగాళ్లను పరిపాలించిన కుటుంబాల సంగతి చెప్పనే అవసరంలేదు.

బిచ్చగాళ్ల రాజు వద్ద ఎంత డబ్బున్నప్పటికీ వాళ్లు సంఘంలో వెలిగానే ఉండేవారు. అతడికి ఇంట్లో ఎంత రాజోపచారంగా జరిగినప్పటికీ, బయటికి అడుగు పెడితే ఎవరూ లక్ష్యపెట్టేవారు కారు.

హంగ్‌చౌ మహానగరంలో చిన్ లావోతా అనే బిచ్చగాళ్లరాజు ఉండేవాడు. ఏడు తరాలనుంచి ఆయన పూర్వీకులు బిచ్చగాళ్ల రాజులుగా ఉంటూ వచ్చారు. అందుచేత ఆయనకు ఎన్నో భవనాలూ, ధాన్యాగారాలూ, పుష్కలంగా డబ్బూ, అంతులేని దాసదాసీ జనమూ ఉండేవి. నగరంలోని మహా సంపన్నులలో ఆయనకూడా ఒకడు.

ఆయనకు సంఘంలో పరువు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలన్న కోరిక కలిగింది. అందుచేత ఆయన బిచ్చగాళ్లకు రాజుగా ఉండే పనినుంచి విరమించుకుని, ఆ పదవిని తన దాయాదికి ఒకడికి ఇచ్చేశాడు. అయినప్పటికీ అందరూ ఆయనను ఇంకా బిచ్చగాళ్ల దొర అనే పిలుస్తూవచ్చారు.

ఆయనకు యాభై దాటాయి. భార్య చాలా కాలం క్రితమే పోయింది. కొడుకులెవరూ లేరు, యును అనే కుమార్తె ఒక్కతే

చీనా జానపద కథ

ఉన్నది. ఆమె అపురూప సౌందర్యవతి. తండ్రి ఆమెను కోట్లకు ఎత్తుగా చూసుకునే వాడు. ఆమెకు చక్కగా చదువు చెప్పించాడు. అన్ని విద్యలూ నేర్పించాడు. ఆమె కవిత్వం చెప్పేది, అనేక జంత్రవాద్యాలు చక్కగా వాయించేది.

సర్వలక్షణ సమన్వితురాలైన యునుకు ఎంతో గొప్ప సంబంధం తీసుకురావాలని తండ్రి ఆశించాడు. అలాటి కన్య గొప్పవాళ్ళ ఇళ్ళన్నీ ఘాలించినప్పటికీ దొరకని మాట నిజమే అయినా, ఆమె తండ్రి బిచ్చగాళ్లకు రాజు కావటంమూలాన గొప్ప ఇంటివాళ్ళెవరూ ఆమెను పెళ్ళాడతామని రాలేదు. పద్ధెనిమిదేళ్ళు నిండినా ఆమెకింకా ప్రధానం కాలేదు.

ఆ నగరంలోనే మోచీ అనే యువకు డొకడున్నాడు. అతను చాలా అందమైన వాడు, కాని నిరుపేద. తల్లిదండ్రులు లేరు. వయసు ఇరవై ఏళ్ళు. కొన్ని ప్రభుత్వ పరీక్షలలో ఉత్తీర్ణుడయాడు. కాని పేదవాడు కావటంచేత ఇంకా పెళ్ళి కాలేదు. అతని సంగతి విని చిన్ తన కుమార్తెను అతని కిచ్చి ఇల్లరికం ఉంచుకోవటానికి సమ్మతించాడు. తన మామగారి వంశం బిచ్చగాళ్ళ రాజులని తెలిసికూడా పేదవాడు గనక అతను వివా



హానికి సమ్మతించాడు. అతనికి ఏమీ ఖర్చు తగలకుండా వివాహం జరిగిపోయింది.

భార్య అపూర్వ సౌందర్యవతి, సమర్థురాలు. మోచీకి స్వర్గంలో ఉన్నట్టున్నది. ఈ సంబంధం చేసుకున్నందుకు అతని స్నేహితులలో హర్షించనివాడు లేడు. పెళ్ళి అయాక ఒకనాడు అతను తన స్నేహితులందరినీ ఆహ్వానించి మామగారి ఇంట విందు చేశాడు.

ఈ విందు గురించి ఎలా తెలిసిందో దాయాదికి తెలిసింది. "చిన్ ఎక్కువేమిటి, నా తక్కువేమిటి? నన్ను విందుకు పిలవకుండా పైవాళ్ళ నందరినీ పిలుస్తాడా?"



అంటూ కొత్త బిచ్చగాళ్ళ రాజు తనకింద ఉండే బిచ్చగాళ్ళను యాభై, అరవైమందిని వెంటబెట్టుకుని, కేకలు పెడుతూ చిన్ ఇంటి మీద వచ్చిపడ్డాడు.

వీళ్ళంతా దండులాగా వచ్చి పడేసరికి మోచీ, అతని మిత్రులూ బయటికి పారి పోయారు. చిన్ బిచ్చగాళ్ళకు క్షమాపణ చెప్పుకుని, "ఇది మా అల్లుడు ఏర్పాటు చేసిన విందు. మీ అందరికీ వేరే విందు ఏర్పాటుచేస్తాను," అంటూ అందరికీ బహు మానాలిచ్చి పంపేశాడు.

ఆ రాత్రి ఏ స్నేహితులతోనో గడిపి మోచీ మర్నాడు ఉదయం తిరిగి వచ్చేసరికి చిన్ తన అల్లుడి ముఖం చూడటానికి సిగ్గు పడ్డాడు. అంతదాకా యును తన గదిలో అవమానంతో కుళ్ళిపోతున్నది. కాని మోచీ పైకి ఏమీ అనలేదు.

అది మొదలు యును తన భర్త అభి వృద్ధిలోకి రాగలందులకు చేయదగినదంతా చేసింది. అతనికి కావలిసిన పుస్తకాలన్నీ కొనిపెట్టింది. పండితులను ఇంటికి పిలి పించి అతనిచేత గొప్పగొప్ప గ్రంథాలన్నీ చదివింపజేసింది. అతని పలుకుబడి పెరగ టానికి గొప్పగొప్పవాళ్ళ నందరినీ తన ఇంటికి ఆహ్వానించింది. మోచీ ఉన్నత పరీక్షలో ఉత్తీర్ణుడై హాన్లిన్ పరిషత్తు అనే దానిలో సభ్యుడయాడు. అతను రోజూ దర్బారు దుస్తులు ధరించి పరిషత్తుకు వెళ్ళి వస్తూండేవాడు. వీధిలో అల్లరిపిల్లలు అతన్ని చూసి, "బిచ్చగాళ్ళ దొర అల్లుడు ఉద్యోగి అయినాడురోయ్!" అనేవాళ్ళు.

మోచీ తన మామగారిపట్ల పైకి మర్యాద గానే ఉంటున్నా, లోలోపల అలాటివాడి కూతుర్ని చేసుకున్నానే, ఇలా పైకి వస్తానని తెలిస్తే ఇంకా పరువైన సంబంధం చేసు కుందునుగదా అనుకునేవాడు. భార్యను వదిలివెయ్యాలన్నా అతనికి తగిన కారణం దొరకలేదు. తాను పైకి రావటానికి తన

భార్య చేసిన సహాయం యావత్తూ అతను పూర్తిగా మరిచిపోయాడు.

కొంతకాలమయాక మోచీకి వూవెయ్ అనేచోట జనాభా అధికారిగా ఉద్యోగం వచ్చింది. రాజధానినుంచి అక్కడికి నదిపై వెళ్ళవచ్చు. అతను భార్యతోసహా పడవ మీద బయలుదేరాడు. కొద్ది రోజుల అనంతరం పడవ త్సాయిషీ కొండవద్ద లంగరు దించింది. ఆ రాత్రి నిండు పూర్ణిమ. మోచీ నిద్ర పట్టక వెన్నెల చూసి ఆనందించటానికి పడవమీదికి వెళ్ళాడు.

అక్కడ అతనికి ఒక దుర్మార్గపు ఆలోచన కలిగింది. యును చచ్చిపోతే తాను మరొకతెను పెళ్ళాడి ఈ అవమానంనుంచి బయట పడవచ్చు ననిపించింది. అతను కిందికి దిగి వెళ్ళి, యునును నిద్ర లేవగొట్టి వెన్నెల చూసే నెపంమీద బలవంతాన పైకి తీసుకువచ్చి, ఆమెను పడవ అంచునుంచి నీటిలోకి చప్పున తోసేశాడు.

తరవాత అతను కళాసులను నిద్ర లేపి, "త్వరగా పడవను సాగించండి. ఎంత వేగంగా పోతే అంత మంచి బహుమానం ఇస్తాను," అన్నాడు. జరిగిన సంగతి ఎరగక వాళ్ళు లంగరు ఎత్తి, తెడ్లు వేస్తూ పడవను వేగంగా నడుపుకు పోయారు. నాలుగు



మైళ్ళు పోయి మళ్ళీ లంగరు దించాక మోచీ వారితో తన భార్య చంద్రుణ్ణి చూస్తూ ప్రమాదవశాన నదిలో పడిపోయినట్టు చెప్పాడు. వాళ్ళు నిజం గ్రహించికూడా పైకి ఏమీ అనలేకపోయారు.

అక్కడ యును నదిలో పడి మునిగిపోలేదు. ఆమె కాళ్ళకింద ఏదో ఉండి ఆమెను మునగకుండా చేయటమే గాక ఒడ్డుదాకా తీసుకుపోయింది. ఆమె ఒడ్డుకు ఎగబాకి అక్కడ ఒంటరిగా కూర్చుని, తన దుర్గతికి విలపించ సాగింది. తనను చంపేసి తన భర్త మరొక పెళ్ళి చేసుకోవటానికి నిశ్చయించాడని ఆమె గ్రహించింది.



అదృష్టవశాత్తూ మోచీ పడవ వెళ్ళిన కొద్ది సేపటికే ఆ చోటికి మరొక పడవ వచ్చి లంగరు దించింది. ఆ పడవలో ఒక రవాణా అధికారి ఉన్నాడు. అయన పేరు హూటేహూ. అయనా, అయన భార్యా తమ గదిలో నిద్ర పోబోతూ వెన్నెలను చూడటానికి తలలు బయట పెట్టేసరికి ఎవరో ఏడుస్తూ ఉండటం వినిపించింది. వాళ్లు పడవవాళ్లను పంపి ఒడ్డున కూచుని ఏడ్చే యునును పడవలోకి రప్పించారు. ఆమె కథ అంతా విన్నారు. ఆమెకు పొడిబట్ట లిచ్చి, ఓదార్చి, "ఏడవకు. నిన్ను మా కూతురిలాగే దగ్గిర ఉంచుకుని, నీకు ఏదోవిధంగా సహాయపడతాం," అని చెప్పారు. వాళ్లు పడవవాళ్లతోకూడా ఈ సమాచారం బయటపెట్టవద్దని చెప్పారు.

కొద్దిరోజులకు హూ తన ఉద్యోగస్థానం చేరుకున్నాడు. హువెయ్ కార్యాలయంపైన అయన పెద్ద అధికారి, మోచీ అయనకింద ఉద్యోగి. కొత్త రవాణా అధికారి వచ్చాడనగానే తక్కువ ఉద్యోగులంతా అయనను చూడవచ్చారు. వారిలో మోచీకూడా ఉన్నాడు. అతన్ని చూసి అయన, "వీడు చాలా అందగాడు కూడాను. ఇంత నీచానికి పాల్పడ్డాడేమిటో!" అనుకున్నాడు.

కొద్ది మాసాలు గడవనిచ్చి హూ తన కింది ఉద్యోగులతో, "నాకు పెళ్ళి కావలి



సిన కుమార్తె ఉన్నది. ఆమెకు తగిన వరుడు దొరికినట్టయితే ఇల్లరికం ఉంచు కుందా మనుకుంటున్నాను," అని మాట వరసగా అన్నాడు.

మోచి తన భార్యను పోగొట్టుకున్నాడని అందరికీ తెలుసు. అందుచేత అందరూ అతన్ని సిఫార్సు చేశారు. అతను ఏమంటాడో కనుక్కోమని షూ వారితో అన్నారు.

అంత పెద్ద అధికారికి అల్లుడు కావటమనే సరికి మోచి ఎగిరి గంతేశాడు. తనకు అంత అదృష్టం పడుతుందని అతను కలలోకూడా అనుకోలేదు. అతను సమ్మతించినట్టు విని షూ, "మా అమ్మాయిని గారాబం చేసి పాడు చేశాం. అతను దాని చెప్పుచేతలలో ఉండ టానికి ఒప్పుకునేటట్టయితేనే ఈ పెళ్ళిచేసు కోవటం మంచిది. ఉన్న సంగతి ముందే చెప్పాను," అన్నాడు.

మోచి తన భార్యకు విధేయుడై ఉండ టానికి సమ్మతించాడు.

షూ తనకు మళ్ళీ పెళ్ళి చెయ్యబోతు న్నాడని మొదట విన్నప్పుడు యున ససే మిరా అన్నది. "నా వెంట వచ్చిపడిన అవ మానం సహించలేక ఆయన నన్ను వది లించుకోవాలనుకున్నారే గాని, నేను ఆయ నను వదిలి మరొకరిని చేసుకోవటం అధర్మం!" అన్నదామె. ఆమె చేసుకో



పోతున్నది అతనినేనని తెలిశాకనే ఆమె పెళ్ళికి ఒప్పుకున్నది. ఆమె తన కళ్ళు తుడుచుకుని, అలంకారాలు చేసుకుని, పెళ్ళికూతురు దుస్తులు ధరించింది.

మోచీ పెళ్ళికొడుకు వేషం వేసుకుని గుర్రం ఎక్కి మామగారి ఇంటికి వెళ్ళాడు. మామగారు అల్లుడికి చేయవలిసిన మర్యాద లన్నీ చేశాడు. అతిథులంతా వెళ్ళిపోయాక పెళ్ళికొడుకును పెళ్ళికూతురుండే చోటికి పంపారు. కాని అతను గదిలోకి అడుగు పెట్టు తూండగానే తలుపుల వెనకనుంచి ఏడెనిమిది మంది దాసీలు అతనిపైన పడి కర్రలతో బాదసాగారు.

"ఓ మామగారూ! ఓ అత్తగారూ! రక్షించండి!" అని అతను ఎలుగెత్తి అరిచాడు.

"కొట్టకండి, కొట్టకండి. ఆయనను ఇలా తీసుకురండి!" అని పెళ్లికూతురు అనటం అతనికి వినిపించింది.

అతను పెళ్లికూతురిని సమీపించి, "నేనేం పాతకం చేసుకున్నాను? నా కెందుకీ శిక్ష?" అన్నాడు. కాని ఆమె ముఖంమీదినుంచి మేలిముసుగు తీసేసరికి అతను భయంతో కొయ్యబారిపోయి, "దయ్యం! దయ్యం!" అని పొలికేకలు పెట్టి వణికాడు.

దాసీలందరూ గొల్లున నవ్వారు. వృద్ధ దంపతులు ఈ కేకలు విని పరిగెత్తుకుంటూ వచ్చి, అతనితో అసలు విషయమంతా చెప్పారు. యును కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది. ఆమెను ఎలా ఓదార్చాలో తెలియక మోచీ ఆమె కాళ్లు పట్టుకున్నాడు.

అతన్ని క్షమించమనీ, అతను చేసిన దానికి పశ్చాత్తాప పడుతున్నాడని వృద్ధ దంపతు లిద్దరూ యునుకు నచ్చచెప్పారు. ఆ విధంగా ఆ భార్యా భర్తలు తిరిగి కలుసుకుని యావజ్జీవం విభేదాలు లేకుండా సుఖంగా కాపరం చేశారు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫొటోలకు నమూనాలు





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలిః- చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పట్టు తప్పితే పడిపోతావ్

రెండవ ఫోటో : చదవకపోతే చెడిపోతావ్

పంపినవారు : ఎం. సి. లింకన్, II బి.ఎస్.సి.,

ఉస్మానియా కాలేజి, కర్నూలు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ప్రశ్నోత్తరాలు

1. వి. ఆర్. శేఖర్, చేబ్రోలు

"చందమామ"ను సంవత్సరమున కొకసారి "ప్రత్యేక జన్మదిన సంచిక"గా వెలువరించగూడదా?

ఈ సారి జూలై సంచికను "ప్రత్యేక జన్మదిన సంచిక"గా వెలువరించటానికి ఆలోచిస్తున్నాము.

2. బి. రామకృష్ణుడు, బ్రాహ్మణకొట్కూరు

గోమటేశ్వరుని తండ్రి ఎవరు? అతడు ఏ రాజ్యమును పరిపాలించుచుండెను?

గోమటేశ్వరుని వాస్తవ కథ తెలియదు. ఉన్న కథ పుక్కిటిపురాణంలా కనబడుతుంది.

3. ఎ. రామచంద్రారెడ్డి, గద్వాల్

అన్నయ్యా, మీరు ప్రచురించే బేతాళకథలు యథార్థమా లేక కల్పితమా?

ఇప్పుడు ప్రచురించే బేతాళకథలు "కల్పితం" అనే ప్రచురిస్తున్నాంగదా!

4. వేలంశెట్టి రామారావు, ఉలవపాడు

'బేతాళ కథలు'లో మేమేదైన నొక కల్పితకథను పంపితే ప్రచురించుతారా?

బాగుంటే తప్పక ప్రచురిస్తాం. బేతాళకథలుగా పనికివచ్చేవాటిని పంపమని మేం చాలాకాలం క్రితమే కోరాం.

5. ఎన్. ఎల్. జయశీల, బిట్రగుంట

చందమామ అన్నయ్యా! పూర్వకాలము స్త్రీలను ఎందుకు చదవనియ్యలేదు, ఈ కాలము ఎందుకు చదువనిచ్చుచున్నారు?

వేదకాలంలో స్త్రీలు పురుషులతో సమంగా చదువుకునేవారు. అయితే మధ్యకాలంలో జీవితమూ, నాగరికతా స్తంభించిపోయి స్త్రీలకు చదువుతో అవసరమే లేకుండా పోయింది. ఈనాటి జీవితం బాగా విస్తరించుతూ ఉండటంవల్ల స్త్రీలకు కూడా చదువూ, లోకజ్ఞానమూ అవసరమయింది.

6. అనంతరాజు మల్లికార్జునరావు, ఉప్పూరు

సాహిత్య క్షీరసాగరాన బహుకాలంగా నివసించుట చేతనేమో, సునిశిత రచనా "చక్రపాణి" చల్లని కథల వెన్నెలల వెదజల్లె "చందమామ" అయినాడు. బావామఱుదులు ఇద్దరు వ్యక్తులు కాకుండా ఒక్కడే కావటము చిత్రమైన విషయంకదా, చందమామయ్యా?

ఇది కేవలం తపోదీక్షాఫలితం.

7. బి. ఎ. లింగప్ప, రాబర్ట్సన్ పేట

"చందమామ" అభ్యుదయానికి కారణకర్త లెవరు?

చాలామంది ఉన్నారు. వారిలో పాఠకులు నిర్వహించే పాత్ర గణనీయమైనది.

8. కుమారి ఇ. సామ్రాజ్యలక్ష్మి, పళ్ళిపట్టు

ఫొటోవ్యాఖ్యల పోటీకి ఒక వ్యక్తి కార్డులో ఎన్ని వ్యాఖ్యలు పంపవచ్చు?

ఎన్నయినా పంపవచ్చు, ఒకే కార్డులో ఎందరైనా పంపవచ్చు.

9. మండలపర్తి కామేశ్వరి, మచిలీపట్నం

ఏమండీ! మార్చినెల సంచికకు నేను పంపిన ప్రశ్న......పేరిట ప్రకటించారేం?

ఇద్దరూ ఒకే ప్రశ్న పంపి ఉంటారు. ముందు చేరిన ప్రశ్నకు సమాధానం వచ్చి ఉంటుంది.

10. బి. జయరామయ్య, కర్నూలు

మీకు చిత్రించే బొమ్మలు కథ ననుసరించి చిత్రించెదరా, లేక చిత్రించిన బొమ్మల ననుసరించి కథ వ్రాయబడునా?

ముందు కథ తయారవుతుంది, తరవాత బొమ్మలు తయారవుతాయి.

11. యం. గంగాధర్, నవీపేట్

అన్నయ్యా, రేడియోను మొట్టమొదట కనిపెట్టినవాడు సర్ జగదీశచంద్ర బోస్ అని నేను, మార్కొని అని నా మిత్రుడు వాదించుకుంటున్నాము. తమరు ఎవరితో ఏకీభవించుతారు?

మొట్టమొదటగా రేడియో తరంగాలతో సందేశాలు పంపి వాడు మార్కొని.

* కొత్త శీర్షిక! ప్రకటన పేజీలలో వివరాలు చూడండి—సం.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు తోటలోకి వెళ్ళి, పుస్తకాల సంచిని ఒక కొమ్మకు తగిలించి ఆడుకుంటున్నారు. ఆ పక్కనే వున్న ఒక గడ్డికుప్పనానుకుని అప్పటి వరకూ చదువుకుంటూన్న ఒక కుర్రాడు, దాసూ, వాసూలను ఏడిపించేందుకు, వాళ్ళ పుస్తకాల సంచిని తీసుకుని గడ్డిలో దాచేందుకు వెళ్ళాడు. అతడు గడ్డి కుప్పను సమీపించేసరికి, కుప్పలోంచి యింత గడ్డి ఎగిరి పైకి లేచింది. కుర్రాడు హడలుకుని తన పుస్తకాలుకూడా అక్కడవదిలి పారిపోయేంతలో, దాసూ, వాసూలు అక్కడికి వెళ్ళి, గడ్డిలో దాగివున్న 'టైగర్'ను బయిటికి లాగి, పారిపోతున్న కుర్రాణ్ణి పిలిచారు. వాడు 'టైగర్'ను చూసి నవ్వుకున్నాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# కేశపోషణ
# ఒక కళ

మీ 'చూపుల' లాలిత్యాన్ని మెరుగులు దిద్దే ఆ ప్రకాశమానమైన దీర్ఘ కురుల సంపద అప్పటికప్పుడు అమరినది కాదు. కేశపోషణకై చెప్పబడిన కేశవర్ధినితో సుకుమార పుష్టిని చేకూర్చుటంవల్ల కల్గిన ఫలితం.

సంపూర్ణ పరిపుష్టిని కూర్చే లక్షణాలు గల కేశవర్ధిని నల్లటి దీర్ఘ కురులను ప్రసాదించటమే కాదు, కేశములను కాంతివంతంగా, కోమలంగా చేయగల సుగుణము కలిగి వున్నది.






కేశవర్ధిని పోషణతో
మరులు కొలుపు కురులను పెంపొందించుకొనండి

## కేశవర్ధిని

హెరాయిల్, షాంపూ, అంజన్

కేశవర్ధిని ప్రొడక్ట్స్,
క్రాస్‌కట్ రోడ్డు, కోయంబత్తూరు.

యువ ప్రచురణలు ఆధునిక రచయితల
అత్యుత్తమ పుస్తకాలు, కేటలాగుకు వ్రాయండి



# యువ బుక్స్

**29-1-194, సైఫాబాద్,**

హైదరాబాదు-4

# మిఠాయిలు




న్యూట్రిన్‌వారి రుచికరమైన మిగడ గల టాఫీలు, మీరు పదిలపరుచుకోవడానికి ఉత్సాహపరేటంతటి ధృఢమైన టిన్నులలో దొరకును.

అదిగాక, న్యూట్రిన్ టిన్నులలో మిఠాయిలు సగమునగము గాకుండా, పూర్తిగా నింపుటచే, మీకు ఎక్కువ టాఫీలు లభించును.

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

త్వరలో
విడుదల!



పద్మశ్రీ



# జగన్నాటకం

భక్తికి మించిన శక్తిలేదని
ప్రబోధించే మహోజ్వల
చిత్రము.....





| కథ: | దర్శకుడు: | కెమెరా: | సంగీతం: |
|---|---|---|---|
| శ్రీరామానంద్. | వి. శోభనాద్రిరావు. | బి.యస్. కొండారెడ్డి. | అశ్వత్థామ |


LIFEBUOY
SOAP

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**(Rule 8 Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS :<br>PARTNERS,<br>1. Sri. B. Venugopal Reddi.<br>2. Smt. B. Seshamma.<br>3. Smt. B. Rajani Saraswathi.<br>4. Smt. A. Jayalakshmi.<br>5. Sri. B. L. N. Prasad.<br>★ 6. Kumari B. Sarada.<br>★ 7. Sri. B. Viswanatha Reddi.<br>★ 8. Sri. B. Venkatrama Reddi.<br>★ MINORS |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1960*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*

Photo by S. Parashram



బహుమతి
పొందిన వ్యాఖ్య

చదవకపోతే చెడిపోతావ్

పంపినవారు:
ఎం. సి. లింకన్ - కర్నూలు

